

Chandamama, November '50 Photo by A. L. Syed

కోతులాట

ప్రతిభా వారి

# స్వప్నసుందరి

దీపావళి
విడుదల



అంజలీదేవి
జి.వరలక్ష్మి
నాగేశ్వరరావు
శివరావు..ముక్కామల

స్టూడియో
వాహిని..

ప్రొడ్యూసర్ & డైరెక్టర్:
జి.బలరామయ్య



| ఆంధ్ర, సీడెడ్, నైజాములకు: | మైసూర్, తమిళనాడుకు: |
|---|---|
| ది పూర్ణా పిక్చర్స్ లిమిటెడ్, విజయవాడ. | తల్లం పిక్చర్స్ సర్క్యూట్, బెంగుళూరు-2 |

ఆరోగ్యానికీ, రుచికరానికీ



పూజలకు, వివాహాలకు




గడియారం మార్కు

కర్పూరము

ఉపయోగించండి

గోపాల్జీ చాంపక్షీ & కో.
గోవిందప్ప నాయక్ వీధి, మద్రాస్

# మిత్రాంజనం




మిత్ర ఫార్మసీ - తెనాలి

అమెరికన్ మోడల్

## రోల్ - ఫిలిమ్ బాక్స్ కెమెరా



గొప్ప పవరు లెన్సుకలిగి నరసమగు వెలకులభించే ఈ అందమైన, మన్నిక గల, కెమెరాతో మీరు 120 ఫిలింపైన 2"×3" సైజు చక్కటి ఫొటోలు తీయవచ్చు. ఫొటోలు సరిగ్గా రాలేదని ఋజువు చేసిన వారికి కెమెరా ఖరీదు వాపసు చేయబడే గ్యారంటీ పత్రం ప్రతి కెమెరాతో వుంటుంది. "ఫొటోలు తీయటం ఎలాగ?" అనే వివరాలు కూడా ప్రతి కెమారాతో ఉచితంగాపంపబడును.

వెల: రు. 8/- తపాలాచార్జీ 1-8-0 అదనం

కెమెరాకు నరిపడే లెదర్ కేసు....రు. 3/-లు

తపాలాచార్జీ రు. 0-8-0 అదనం

ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి

ORIENTAL CAMERA HOUSE
(9) ALIGARH—(U.P.)

ప్రధానాంధ్ర రాయలసీమ కేంద్రములలో అసమాన జానపద చిత్రము



అక్టోబర్

# 27

ప్రారంభము



టి.యస్.టి. వారి

# అదృష్ట దీపుడు

సూర్యకుమారి... పద్మ... శర్మ... ముక్కామల

సీత... చిట్టి... కుటుంబరావు ...

డైరెక్టర్... ఎస్. సౌందరరాజన్

త్వరలో విడుదల కానున్నది!

ప్రఖ్యాత కథ .... ప్రసిద్ధ తారాగణం...

ఇప్పుడొక్క మహత్తర చలన చిత్రముగా
రూపొందినది!




నాగయ్య
లలిత
పద్మిని
నటించినది.

*Based on*
VICTOR HUGO'S
"LES MISERABLES"

చిత్రియా రిలీజ్...



**NARAYANAN Co**
*Release*

# చందూయొక్క సాహసకృత్యములు



















ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

వస్తూంది!

విజయా వారి...

# పాతాళ భైరవి

దర్శకుడు – K.V. రెడ్డి, B.Sc (HONS)

నిర్వహణ – నాగిరెడ్డి: చక్రపాణి...



# చందమామ


పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి


ఈ నెల 13-వ తేదీ నాగుల
చవితి. ఆమరునాడే నాగపంచమి. డిశంబరు
14 న సుబ్రహ్మణ్యషష్టి. ఈ మూడు రోజులూ మనకు
పాములను గురించిన పర్వాలు. నాగుమయ్యని కొలుచుంటే,
బిడ్డలు లేనివాళ్ళకు సంతతి కలుగుతుందనీ, చెవి బాధలూ అవీ
నయమవుతాయనీ మనవాళ్లకు చాలా నమ్మకం. కనుక మహిమగల
నాగుమయ్యని అనాదినించీ మనపూర్వులు పూజిస్తూనే వున్నారు. ముఖ్యంగా
గట్లవెంబడి పుట్లవెంబడి రాత్రింబగళ్లు తిరుగులాడే రైతుబిడ్డ, పాము చల్లనిచూపు
చూస్తేనే క్షేమంగా వుండగలడు. అందుచేతనే, నాగులచవితినాడు ధనికులు,
బీదలు, అందరూకూడా ఉపవాసాలుండి, మొక్కులు చెల్లించి, పుట్టలో నాగు
మయ్యకు పాలుపోసి, చలిమిడీ చిమ్మిలీ వడపప్పూ పానకమూ పంచిపెడతారు.
చాలామంది మక్కువకొద్దీ తమ బిడ్డలకు నాగన్న, సుబ్బరాయుడు మొదలైన పేర్లు
కూడా పెట్టుకుంటారు. నాగపూజ మనకంటే మలబారుదేశంలో మరీ ఎక్కువ.
అక్కడ ఇంటింటా రాతిలో చెక్కిన సుబ్బరాయుడి విగ్రహాలు వెలసిఉంటాయి.
పర్వదినాల్లోనే కాదు, రోజూ దీపారాధనలు జరుగుతై. పైగా, పాములు మసలే
చెట్లమీది ఆకులైనా వారు తుంపటానికి జంకుతారు. అక్కడ ఒక్క హిందు
వులేగాక, క్రైస్తవులూ, మహమ్మదీయులూకూడా నాగపూజచేస్తారు.
వీరు చేసే పూజలకు మెచ్చి, పూర్వకాలమందు నాగు
మయ్యలు నిజంగానే వచ్చి, భక్తుల చేతుల్లో
ప్రసాదాలు ఆరగించిపోయేవట!




సంపుటి 7
సంచిక 5

నవంబరు
1950

# యుక్తిపరుడు

ఒక్కరోజు రాజుగారి
వద్ద కొక్క గజదొఁగను
పట్టి తెచ్చినారు భటులు
అట్టహాసమగు హఁగున.

రాజతని విచారించి
విధించాడు మరణశిక్ష
చఁకలు గొట్టారు భటులు
తీరిఁదని వారి కక్ష.

అతని చేయి బట్టి వారు
రా రమ్మని లాగినారు
అతడు 'దప్పివేస్తున్నది
కావా'లన్నాడు నీరు.

రాజది విని పాత్రతోడ
తెప్పించా డపుడు జలము
దప్పగొన్న గజదొఁగకు
ఇప్పించాడపుడు జలము.

కాని నీరు త్రాగునంత
లోన చంపుతారేమో
అని తన మనమున అతడు
భీతి చెందినాడేమో

రచన:
'బైరాగి'

త్రాగడాయె జలమెంతకు
'భయపడక నీవు త్రాగు
నంతవరకు నిన్నెవ్వరు
చంపరు' అన్నాడు రాజు.

వెంటనే ఆనీటి పాత్ర
విసరివేసి నేలపైన
ఆనీరే ప్రోగుచేయు
మనెను దొంగ రాజుతోడ.




ఆనీరే త్రాగునంత
వరకాతని చంపరు అని
వాగ్దానమ్మిడిన రాజు
అపుడు దొంగమాటలు విని

సూక్ష్మయుక్తి కెంతో మది
అచ్చెరువొందియు అతని
విడిపుచ్చ నాజ్ఞనిచ్చె
భటులకు కడు సంతసమున.



దప్పితీర్చుకొని ముదాన
వెడలిపోయె దొంగవాడు
యుక్తిపరున కెన్నటికిని
కలుగదు సుంతైన కీడు.

# పాపతో సరదాలు

"మహేశ్వర్" (మద్రాసు)

రావాలంటే రావాలి
అల్లరి పాపా రావాలి
వచ్చి ముద్దులు ఇవ్వాలి
దోబూచాడి పోవాలి

లేవాలంటే లేవాలి
లెమ్మనగానే లేవాలి
విద్దెంచేస్తూ రావాలి
ఒళ్ళో వాలిపోవాలి

రావాలంటే రావాలి
రమ్మనగానే రావాలి
చేతులు చాచి రావాలి
చర చర నడిచి రావాలి

కావాలంటే కావాలి
ముద్దులు చాలా కావాలి
మురబ్బలాగా వుండాలి
మళ్ళీ మళ్ళీ కావాలి

చేయాలంటే చేయాలి
అల్లరి బాగా చేయాలి
అల్లరిబాజా కావాలి
ఊసులు ఎన్నో తేవాలి

పోవాలంటే పోవాలి
నాన్న పిలుస్తే పోవాలి
పొమ్మనగానే పోవాలి
పనివేళల్లో పోవాలి

ఊదాలంటే ఊదాలి
తూ తూ బాకా ఊదాలి
పి పీ బూరా ఊదాలి
ఊదీ ఊదర గొట్టాలి

ఊగాలంటే ఊగాలి
గుమ్మాడెక్కి ఊగాలి
గుమ్మాటంలా తిరగాలి
పాటలు పాడుతు ఊగాలి

ఆడాలంటే ఆడాలి
గుడు గుడు గుంచం ఆడాలి
ఆటలు పాటలు రావాలి
రావాలంటే రావాలి

చిడిముడి పలుకుల పాపాయి
చిలిపి చేష్టలా పాపాయి
అల్లరి చిల్లర భావాల్తో
అందలమెక్కే పాపాయి




పూర్వం ఒక పట్టణానికి ఒకరాజు ఉండేవాడు. ఒకనాడు ఆరాజు మంత్రులతోటి తక్కిన ఉద్యోగులతోటి నిండు కొలువుతీర్చి ఉండగా, ద్వారపాలకుడు లోపలకువచ్చి, 'ప్రభూ, ఎవరో 'మహాబలుడట! వచ్చి ద్వారంవద్ద ఉన్నాడు. దేవర దర్శనం చేయించమని కోరుతున్నాడు' అన్నాడు. రాజు, 'ప్రవేశపెట్టు' అన్నాడు. ద్వారపాలకుడు 'చిత్తం' అంటూ వెళ్లిపోయాడు.

సభలోనివారి దృష్టి అంతా ఒక్కమాటు ద్వారంవైపు మళ్ళింది. పిక్కటిల్లిన కండలుగల దండలు, విశాలమైన రొమ్ము, అజానుబాహువులు, బలమైన కాళ్లూగల వస్తాదెవరో సభను ప్రవేశించబోతున్నాడు అనుకున్నారు వాళ్ళంతా. కాని చూసిరిగదా, ఎండిపోయిన ములగ కాడకు మల్లే సన్నపాటి బక్కవాడొకడు ద్వారపాలకుని వెనకాలే ప్రవేశించాడు. ప్రవేశించి, రాజుగారికి నమస్కారంచేసి 'జయీభవ, విజయీభవ' అని కైవారం చేయటం మొదలుపెట్టేడు.

రాజుగారు చీదరించుకుని, "ఆగు, 'పేరు గొప్ప ఊరు దిబ్బ' అన్నట్లు, ఉఫ్ మని ఊదితే ఎగిరిపోయే బక్కవాడవు నీవు మహాబలుడవనే పేరెట్టుకున్నావేమిటి?' అన్నారు. అందుకు వాడు వెంటనే, 'మహాప్రభూ ఆపేరు నేనుపెట్టుకున్నదా? నా శిష్యులంతా నన్నుగూర్చి అలా చెప్పుకోవటంవల్ల ఆపేరు వాడుకలోకి వచ్చేసింది' అన్నాడు.

'ఏమిటి? నీకు సాయం శిష్యులుకూడా ఉన్నారా?' అన్నారు రాజుగారు.

'అలైతే నా సంగతి తమకేమీ తెలీదన్న మాట. చిత్తగించండి. కైలాసపర్వతాన్ని ఎత్తిన రావణాసురుడు నా శిష్యుడు. ఆ రావణుణ్ణి చంకన పెట్టుకుని ఏడు సము




ద్రాలలోనూ ముంచి యేడిపించిన వాలి నా అభిమాన శిష్యులలో ఒకడు. ఆ వాలితో ముష్టియుద్ధం చేసిన సుగ్రీవుడూ, సుగ్రీవుని మంత్రియైన హనుమంతుడూ, ఆ హనుమంతునికి గురువైన జాంబవంతుడూ—వీళ్లంతాకూడా నా శిష్యులే!'

'ఐతే నువ్వు రామాయణ కాలంలోని వాడివన్న మాట?' అని అడిగాడు రాజు.

'రామాయణమే కాదు భారతకాలం నాటివాణ్ణి కూడాను ప్రభూ. కాకపోతే జెట్టిమల్లులని పేరుపడ్డ జరాసంధుడు, కీచకుడు, బకాసురుడు, హిడింబాసురుడు, దుర్యోధనుడు—వీళ్లందర్నీ చంపిన భీమన్న—వీళ్ళందరికీ నావద్ద తరిఫీజు పొందేభాగ్యం ఎలా అబ్బిఉంటుందీ?'

'వీళ్ళంతా చనిపోయి చాలాకాలమైంది గదా, నువ్వు ఒక్కడవూ ఇంతకాలం ఎలా బతికేవు?' అని మళ్లీ అడిగాడు రాజు.

'బతకటానికేముంది ప్రభూ, నేను హనుమంతుడూ, జాంబవంతుడూ మల్లే చిరంజీవిని; కాని, కడుపునిండా తిండి లేనప్పుడు, బ్రతికి ఏంలాభం? తిండిలేక శుష్కించి బక్కవాడినై పోయాను. నన్ను ఎరిగున్నవాళ్ళే ఆనవాలు పట్టలేని స్థితి లోకి మారేను కనుక నన్ను ఎరగని తమరు 'ఉఫ్ మని ఊదితే ఎగిరిపోతావ్' అనటంలో ఆశ్చర్యమేముంది?'

'సరే. ఐతే ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?' అన్నారు రాజావారు.

'నన్ను తమ కొలువులో ఉంచుకోండి. కడుపునిండా తిండి పెట్టండి. తిండి పుష్టితో నా పూర్వపు కండపుష్టి వచ్చి, అప్పుడు తమరు ఎంత బరువుపని చెయ్యమన్నా చేస్తాను; కొండ మొయ్యమంటే మోస్తాను' అన్నాడు మహాబలుడు.

రాజుగారికి, 'అదేమిటో చూద్దాం' అనిపించింది. ఆపట్టణానికి పక్కనే ఎత్తు



యిన కొండ ఒకటి అడ్డుగా ఉండి, గాలి రాకుండా చేస్తూ, చాలా ఇబ్బందిగా ఉంది. వీడికి కొన్నాళ్ళు భోజనం పెట్టించి, బలం పుట్టుకున్నాక, వీడిచేత ఆ కొండను మోయించుకువెళ్ళి దూరంగా ఎక్కడైనా పారవేయిస్తే, దానిపీడ వదిలిపోతుందను కున్నాడు రాజు. వెంటనే మంత్రితో 'మంత్రీ, ఇతగాడికి రోజూ ఇష్టమైన పదార్థాలతో సుష్టుగా భోజనం పెట్టించు' అని ఆజ్ఞాపించి, మంత్రి ఏదో మనవి చేయబో తూంటే వినిపించుకోక, ఆనాటికి కొలువు చాలించాడు.

మంత్రి మనవిచెయ్యబోయిన దేమిటంటే, 'ప్రభూ, వీడెవడో తిండికోసం వచ్చిన మోసగాడు. కాకపోతే వీడేమిటి? హనుమంతుడికీ, జాంబవంతుడికీ గురువేమిటి?' అని. కాని అతని మాట వింటేగా రాజు? చేసేదిలేక మంత్రి రాజాజ్ఞ ప్రకారం, లడ్డులతోటీ, ఫేణీలతోటీ, పాయసాల తోటీ, రోజూ ఆ బక్కవానికి భోజనం పెట్టించుతూవచ్చాడు.

ఆ బక్కవాడు మరి కొద్దిరోజుల్లోనే పూబెక్కి బలిశాడు. రాజుగారు ఒకమారు వాణ్ణి రప్పించి, 'ఏమోయ్, నీకు బలం వచ్చిందా? ఇంక కొండను మొయ్యగలవా?' అన్నాడు. 'బలం వచ్చింది ప్రభూ, తమ దయవల్ల. ఒకటిగాదు, యాభై కొండలు మొయ్యమన్నా మోస్తా!' అన్నాడు వాడు. అంత ధైర్యంగా వాడు చెపుతూంటే మంత్రికి ఆశ్చర్యంవేసింది. రాజుగారు తమ జ్యోతిష్కుణ్ణి రప్పించి కొండ మొయ్యటానికి మంచి ముహూర్తం ఒకటి పెట్టించారు. మహాబలుడు కొండ మోయబోతున్నాడన్న వార్త ఆ పట్టణం లోనే గాక దేశదేశాలమ్మట పాకింది. ఇలాంటి గొప్ప వింత చూచిరావటానికి దేశ దేశాలనుంచి జనులు గుంపులు గుంపు

లుగా వచ్చి ముహూర్తం వేళకు కొండవద్ద చేరుకున్నారు.

ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యక, అనుకున్న వేళకి మహాబలుడు కొండవద్దకు వచ్చి సిద్ధంగా వున్నాడు. 'ప్రభూ, ఈ కొండను మోసుకువెళ్లి ఎక్కడ పడెయ్య మన్నారు?' అని అడిగేడు. రాజుగారు క్షణం ఆలోచించి, 'తీసుకుపోయి, ఇక్కడకు ఏభైమైళ్ల దూరంలో ఉన్న ఆ సముద్రంలో పడేసిరావోయ్' అన్నారు. మహాబలుడు, 'అలాగే' అంటూ పైమీదనున్న తువ్వాలు చుట్టకుదురుకింద చుట్టి నెత్తి మీద పెట్టుకుని, చూడటానికివచ్చిన లక్షలాది జనానికి ఎదురుగా కొండపక్కన గొంతు క్కూచుని, వాళ్లతో, 'అయ్యలారా మీరంతా కాస్త సాయంపట్టి, ఈ కొండను నా నెత్తిమీదకు ఎత్తండి. ప్రభువులు ఆజ్ఞాపించిన ప్రకారం దీన్ని మోసుకు పోయి, ఆ సముద్రంలో పడేసి చక్కా వస్తాను!' అన్నాడు.

ఈమాట వినటంతోనే వాళ్ళంతా, ఒకళ్ల మొహా లొకళ్లు చూసుకున్నారు. 'రాజుగారు కనిపెట్టుకున్నారు. త్వరగా రండి; ఆలస్యం చెయ్యకండి!' అని హెచ్చరించాడు మహాబలుడు. 'కొండను ఎవరు సాయం పట్టగలరు?' అన్నారు వాళ్లంతా. 'ఇంతమందిచేరి, కాస్తంత సాయంపట్టలేని కొండను, నేనొక్కట్టీ మోస్తే చూద్దామనే వచ్చారా? వెళ్ళండి, వెళ్ళండి' అన్నాడు మహాబలుడు.

రాజుకు ఆమాట సబబుగానే కనిపించి, 'ఎత్తేవాళ్లు లేనప్పుడు వాడుమాత్రం ఏం చేస్తాడు పాపం' అనుకుంటూ, తన నగరుకు వెళ్లిపోయాడు. మహాబలుడు చేసిన యుక్తికి మెచ్చుకుని, ప్రజలంతా నవ్వుకుంటూ ఎవళ్ళ ఇళ్ళకు వాళ్ళు పోయారు.



21




## 5

[ఏవిధమైన అపదా రాకుండా మూడేండ్లపాటు ఎంతో జాగ్రత్తగా కాపాడుతూవచ్చికూడా, చివరకు కొద్ది తొందరపాటువల్ల రాజు తన ముగ్గురు కుమార్తెలనూ ఎలా పోగొట్టుకున్నదీ కిందటినెల చదివారు కదూ? ఆ తర్వాత ఏమి జరిగిందో చదవండి.]

ఈ కఠోరవార్త వినీ వినటంతోటే రాణి కొయ్యబారిపోయింది. పిల్లలతోబాటు రాణీ కూడా తనకు దక్కకుండా పోతుందేమో నని రాజు భయపడ్డాడు.

"మూడేండ్లూ మొండికేసినట్టుగానే ఈ ఒక్కరోజుకూడా పిల్లల్ని ఎలాగో సమాధాన పరచ గలిగితే ఈ ముప్పు రాకపోయి వుండును గదా? పాపిష్ఠివాడిని, ఆపాటి నిబ్బరంలేక, చూస్తూ చూస్తూ చేతులార నా చిట్టితల్లుల్ని పక్షులకు వప్పగించుకొన్నాను. నారాణీకూడా నాకు దక్కదా?" అంటూ రాజు మొత్తుకొన్నాడు. అక్కడ ఒకళ్ల ముఖానా కత్తివాటు వేస్తే నెత్తురు చుక్క లేదు. గంటలు గడచినా రాణీకి తిరిగి స్పృహ రాకపోయేసరికి, ఆమెబ్రతికే యెత్తు లేదని అందరూ నిరాశచెందారు.

మరి కొద్దిసేపటికల్లా ఆస్థానవైద్యుడు అక్కడికి వచ్చాడు. రకరకాల ఓషధులు యిచ్చి ఎలాగైతేనేం చివరకు రాణీకి స్పృహ తెప్పించాడు. తిరిగి అందరి ముఖాలలో క్షణమాత్రం ఆనందం తొణికిసలాడింది. కాని ఆ సంతోషం అట్టే సేపు నిలవలేదు. రాణీకి స్పృహ అయితే వచ్చిందికాని, ఈసారి తగిలిన దెబ్బతో ఆమె మతి పూర్తిగా చలించిపోయింది— "ఏరీ నా చిట్టితల్లులు? ఎక్కడ దాచారో



చెప్పండి" అంటూ పిచ్చి పిచ్చిగా మాట్లాడసాగింది.

"ఇంకా నీదగ్గిర నేను మర్మం పెడతానా? నామాట నమ్ము. పిల్లల్ని ఎక్కడా దాచలేదు. గద్దలు తన్నుకుపోయినై. నా మాట నమ్మకం లేకపోతే అదుగో, సేవకులున్నారు వాళ్ళని అడిగిచూడు" అని దీనంగా అన్నాడు రాజు.

కాని ఏమిచెప్పినా రాణీ అర్థంచేసికోగల స్థితిలో లేదు. "మీరంతా ఒకటే. మీతో నాకేంపని? నా పిల్లల్ని వెతికి నేనే తెచ్చుకొంటాను. నన్ను పోనివ్వండి" అంటూ లేచి పోబోయింది.

గోరుచుట్టుపైన రోకటిపోటన్నట్టు ఈ క్రొత్త అవాంతరం చూచి రాజుకి ఏమీ పాలుపోయిందికాదు. "ఈమె మనస్సు కుదుటబరచలేరా?" అన్నట్టు ఎంతో జాలిగొలిపేట్టు చూశాడు ఆస్థానవైద్యుడివంక.

ఆయన బాగా ఆలోచించి వెంటనే ఒక ఔషధం ఇచ్చాడు. ఆ మోతాదుతో రాణీ నోరు మెదపటం మానివేసి ఒక శిలాప్రతిమలా వుండిపోయింది.

తరువాత ఆస్థానవైద్యుడు రాజుని ప్రక్కకు పిలిచి—"రాజా! ఇప్పుడు అమ్మాజీవారికి శరీరబాధ యేమీ లేదు. చిక్కు యావత్తూ మానసిక సంబంధమైనదే. ఇందుకుగాను మనం చేయవలసినదల్లా చిరంజీవులను పట్టితెచ్చి ఆమె యెదట పెట్టడం. ఎంత త్వరలో మనం ఈ పని చేయగలిగితే అంత చప్పున రాణీవారు తేరుకొంటారు. కనుక, ఇతర చింతలుమాని, ముందు ఎలా ఐనా మన ముద్దుబిడ్డలను వెతికిపట్టి అమ్మాజీవారి ఎదటపెట్టటానికి ప్రయత్నించాలి. ఈ ఒక్క పనిలో తాము చేయగలిగినదంతా చేయించండి. రాణీవారి ఆరోగ్యాన్ని గురించి నేను చూచుకొంటాను" అని ధైర్యం చెప్పాడు.

"అలాగే చేదాం. ఇందునుగురించి ఇప్పుడే చాటింపు వేయిస్తా. మీరుమాత్రం రాణీని కనిపెట్టి వుండండి" అని మళ్ళీ వేడుకున్నాడు రాజు.

అప్రకారం రాజు తన యావత్తు సిబ్బందినీ మరిఒకసారి దేశం నలుమూలలకూ పంపించాడు. బిడ్డలజాడ తెలుసుకువచ్చిన వారికి తనరాజ్యం యిస్తాననికూడా చాటింపించాడు.

* * *

వారాలూ, నెలలూ గడిచినై. కాని పిల్లల్ని వెతకబోయిన సిబ్బందిలో ఒక్కరూ తిరిగి రాలేదు. చాటింపు విని ఒక్క సమర్థుడు కూడా ముందుకురాలేదు. ఇదంతాచూడగా రాజుకీ మతి చలించేలాగ కనుపించింది. అక్కడ చూడబోతే రాణీపరిస్థితిలో కూడా మార్పు ఏమీ కానరాలేదు.

ఒకనాటి తెల్లవారగట్ల రాజు మూడో అంతస్థుపైన పచారు చేస్తున్నాడు. అమసక వెలుగులో దూరాన, మూడు స్వరూపాలు తన మహలువైపు వస్తుండటం కనిపించింది. వాళ్లు ముగ్గురుపిల్లలు. సమానమైన ఎత్తూలావూ కలిగి, అల్లంతదూరానవున్నా ముగ్గురూ ఒకే అచ్చులో పోసినట్టున్నారు.






వాళ్లు తన కుమార్తెలే అయివుంటా రనుకుని రాజు ఎంతో ఆశతో గబ గబ దిగివచ్చి, వాళ్ళవైపు పరుగెత్తాడు. తీరా దగ్గరకు వెళ్లేసరికి ఆముగ్గురూ మగపిల్లలని తేలింది. అయినా వాళ్ల ముగ్గురిల్లో వుండే ఒకేవిధమైన పోలిక చూచి రాజుకి మన సులో ఒక చిత్రమైన అనుమానం కలిగింది.

" ఒకవేళ నా కుమార్తెలే, ఆ దుష్ట గ్రహాల మాయవల్ల యిలా మగ పిల్లలుగా మారిపోయి వుండరుకద!" అనుకుని వాళ్ల వంక పరీక్షగా చూడసాగాడు.

ఆశతో, నిరాశతో క్షణక్షణానికి రక రకా లుగా మారుతున్న రాజు ముఖలక్షణాలను గమనిస్తూ ఆ ముగ్గురు పిల్లలలో ఒకడు అయనకేసి విస్తుపోయి చూడసాగాడు. చివరికి రాజు ఉండబట్టలేక "మీరెవరు నాయనా? మీదేవూరు? యిలా ఎందుకు వచ్చారు?" అని వేగిరపాటుతో, ప్రశ్నల వెంబడి ప్రశ్నలు అడిగాడు.

తమని ప్రశ్నిస్తున్నది రాజైవుంటాడని ఆ కుర్రవాళ్ళు గ్రహించలేక పోయారు. ఎందువల్లనంటే ఒంటికి సరియైన దుస్తులా లేవు. పైగా ఆయన ముఖంలో కళా కాంతీ లేదు. కావటానికి రాజే అయినా, ఆ నిమి షాన రాజు ఒక సామాన్య మానవునిలాగనే వున్నాడు. ఎవరైనప్పటికీ, అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పాలికదా! అందుకని కుర్ర వాళ్లు—"యిక్కడికి దక్షిణాన వుండే భద్రపురి మావూరు. మీ రాజావారి సాటింపు విని వచ్చాం" అన్నారు.

"ఓహో! అలాగనా. అయితే పదండి. నాకూ అక్కడ పనివుంది. మిమ్మల్ని రాజు గారి దగ్గరకు తీసుకువెళ్ళగల" నంటూ రాజు వాళ్ళని వెంటబెట్టుకుని మహలు చేరుకున్నాడు.

తర్వాత అయన వాళ్ళ ముగ్గురిని కుర్చీ లలో కూర్చోపెట్టి తాను తన సింహాసనం



అలంకరించాడు. "అబ్బాయిలూ! మీకు రాజుతో పని వున్నదన్నారుకదూ!" అంటూ ప్రక్కనున్న కిరీటాన్ని తలపైనధరించాడు.

ఇదిచూచి ఆ కుర్రవాళ్ళలో ఒకతను "ఆఁ! తమరేనా రాజావారు?" అని ఆశ్చర్యపోయి లేచి నమస్కరించాడు. వెంటనే మిగతా యిద్దరుకూడా లేచి నిలబడి నమస్కరించారు. "ఔను, నాయనా! మీరు చూడవచ్చిన ఆ దురదృష్టపు రాజు నేనే. నన్ను గుర్తించలేకపోవటంలో మీ తప్పులేదు. నా పరిస్థితి అలా వున్నది. దానికేం గాని, మీ చరిత్ర చెప్పండి ముందు" అని ఆత్రంతో అడిగాడు.

అప్పుడు ఆ కుర్రవాడు యిలా చెప్పసాగాడు—"మహారాజా! మేము భద్రపురిలో నివసించే ఒక పేదరాలి కుమాళ్లం. నాపేరు వెలుగు; ఇతనిపేరు చీకటి; అతనిపేరు సంధ్య" అని తక్కిన యిద్దరివైపు చూపాడు.

రాజుకి ఆశ్చర్యంతోపాటు నవ్వు వచ్చింది—"యేమిటీ! - మీపేర్లు సంధ్యా, చీకటి, వెలుగూనా? చిత్రంగా వున్నయ్యే! ఇటువంటి పేర్లు పెట్టుకోడానికి ఏమైనా కారణముందా?" అని అడిగాడు.

అందుకు వెలుగు యిలా చెప్పాడు—

"అయ్యా! మేము ముగ్గురం మా తల్లి కడుపున ఒకేరోజున కొద్ది గంటల తేడాలో పుట్టాము. యితను సంధ్యవేళ పుట్టాడు. ఆ తరవాత అతను అర్ధరాత్రివేళ పుట్టాడు. ఆ తరవాత నేను సూర్యోదయమప్పుడు పుట్టాను. ముగ్గురం ఒకేఅచ్చులో పోసినట్లువుండటంచూచి మా తల్లి మాకు ఏమి పేర్లు పెట్టితే బాగుండునా అని ఎంతో ఆలోచించిందట. చివరికి మేము పుట్టిన వేళలకు తగినట్టుగా మాపేర్లు యిలా సంధ్య అనీ, చీకటి అనీ, వెలుగు అనీ పెట్టిందట" అన్నాడు.



"భేష్! బాగావుంది. అయితే మీరు ముగ్గురూ కవలలన్నమాట! ఎంత చిత్రం! నాచిట్టి తల్లులూ కవలలే. కవలల్ని పట్టటానికి కవలలు వెతుక రావటం కేవలం దైవనిర్ణయంగా వున్నదే" అంటూ రాజు ఆ కుర్రవాళ్ళని తనదగ్గిర కూచో పెట్టుకుని, "అయితే, మీరు యిలా బయలుదేరినట్లు మీ అమ్మగారికి తెలుసునా?" అని అడిగాడు.

"తెలియకేం? మాతల్లికి చెప్పకుండా మేము ఏపనీ చెయ్యము. ఆమె యిష్టపడిన మీదటే మేము యిలా బయలుదేరి వచ్చాము. పోతే, యింటివద్ద వృద్ధురాలైన మా తల్లిని వదిలి మేము ముగ్గురమూ వచ్చేస్తే ఎలాగ అని మీరడగవచ్చు. దానికీ కారణం వున్నది. మేము పుట్టిన వేళా విశేషమేమోకానీ సంధ్యవేళ పుట్టినతను ఎక్కువ వెలుగుకానీ, చీకటి గానీ చూడలేడు. సూర్యాస్తమయం అయినదగ్గర నుంచీ, దాదాపు బాగా చీకటి పడేటంత వరకు మాత్రమే యితను నిర్భయంగా సంచరించగలడు. ఇతనిచూపు అంతవరకే. ఈలోపునగానీ ఆపైనగానీ అతను అంధుడి క్రిందనే లెక్క. ఆతర్వాత వాని విషయం వినండి. ఇతను వెలుతురనేది ఏమాత్రమూ సహించలేడు. అందువల్ల చీకటి రాత్రులు ఇతనికి అనుకూలం. చివరికి నా సంగతి: నాకు పూర్తి వెలుగు కావాలి. బాగా తెల్లవారితేగాని బయటికి రాలేను. తిరిగి సూర్యాస్తమయం అయేవేళకే యిల్లు చేరుకోవాలి. మా యీ వింతస్వభావాలను ఆధారం చేసికొనే ఇప్పుడు మేముముగ్గురం ఇక్కడకు రావటానికి సాహసించగలిగాము. తరవాత - రాకొమార్తెలను వెతికి తీసుకురావటం అనేది అంత తేలికైన పని కాదని మాకుతెలుసు. ఈపని సాధించటం మాముగ్గురిలో ఏ ఒక్కరివల్లా కాదనీ తెలుసు. ఐతే, రోజు ఇరవైనాలుగ్గంటల

లోనూ ముగ్గుర మూ ఏటు వంటి పనినైనా చక్కబెట్టటానికి సమర్థుల మయి వుండటంచేత, ఇప్పుడు ఈ అన్వేషణ కార్యములో ముగ్గురమూ కష్టపడి రోజూ ఒక్కొకవేళలో ఒక్కొకళ్ళము మా పనులు మేము చేసికొన్నట్టయితే మాకు అసాధ్యమనేది ఉండనే ఉండదు. ఏకార్యమైనా తప్పక జయించుకు రాగలము. ఈ కారణంచేతనే మా తల్లిని ఒంటిపాటుగా వదిలి, ఇప్పుడు ముగ్గురమూ కలిసి బయలేదరవలసి వచ్చింది" అని చెప్పాడు.



అందుకు రాజు, "నీవు చెప్పినది చాలా బాగుంది. మీ తల్లిని గురించి మీకు వివిధమైన చింతా అక్కరలేదు. ఇప్పుడే ఆమెను రప్పించుతాను. మాతో పాటు మహలులో వుంటారు" అన్నాడు.

"మాకదే పదివేలు" అన్నారు కుర్రవాళ్ళు ముగ్గురూ ఏకకంఠంతో. ఉన్న పాటుగా రాజు తన సేవకుల్ని భద్రపురికి పంపి ఆ కుర్రవాళ్ళ తల్లిని రప్పించాడు. రాజుచూపిన ఈ ఔదార్యానికి ఆమెకూడా ఎంతో మురిసిపోయింది.

రాజు ఆ వృద్ధురాలితో — "అమ్మా! కుర్రవాళ్ళవల్ల మీ వంశచరిత్ర తెలుసుకున్నాను. యిలాటి ధైర్యసాహసాలుగల కవలబిడ్డలను కన్ననీవు ధన్యురాలివి తల్లీ!" అంటూ, ఆమెపట్ల తనకుగల భక్తివిశ్వాసాలను వెల్లడించాడు.

ఆమె అనుమతిపొంది, రాజు కుర్రవాళ్ల పేర్లు కొద్దిగా మార్చి, సంధ్యాకుమారుడు, నిశీధుడు, ఉదయనుడు అని పిలవజొచ్చాడు. కుర్రవాళ్లూ, తల్లీకూడా ఇందుకు ఎంతో సంతోషించారు.

మరునాడే రాజు కుర్రవాళ్ళకి ఒకటో రకమైన కత్తులూ, కఠార్లూ యిచ్చి వాళ్లకు తలకొక గుర్రాన్ని ఏర్పాటు చేయటానికని అశ్వశాలకు తీసుకవెళ్ళాడు.

ఆ కుర్రవాళ్ళ పేర్లకు తగినట్టు రాజు, ఉదయనుడికి సూర్యకాంతిలా ధగ ధగ మెరిసే తెల్లటి గుఱ్ఱాన్నీ, నిశీధుడికి నిగనిగ లాడే నల్లటి గుఱ్ఱాన్నీ, సంధ్యాకుమారుడికి ఎఱ్ఱని గుఱ్ఱాన్నీ యిచ్చాడు.

ఒక సుముహూర్తాన తెల్ల గుఱ్ఱంపైన ఉదయనుడూ, నల్లగుఱ్ఱంపైన నిశీధుడూ, ఎర్రగుఱ్ఱంపైన సంధ్యాకుమారుడూ సుహాసినీ సుభాషిణీ, సుకేశినిలను వెతుక్కుంటూ బయలుదేరారు.

వాళ్లు బయలుదేరేముందు రాజు మూడు నల్ల జెండాలుతెచ్చి మూడు గుఱ్ఱాలకూ ముందుభాగాన కట్టాడు. "నా చిట్టి తల్లుల్ని తీసుకుని ఏ క్షణాన మీరు తిరిగి వస్తారో ఆక్షణాన వీటిని పీకిపారెయ్యండేం, మరిచిపోక" అని హెచ్చరిక చేశాడు.

ఆ తరువాత తమ తల్లీ, రాజూ మనసారా దీవించగా, కుర్రవాళ్లు ముగ్గురూ వాయువేగంతో సాగిపోయారు.

---

పగటివేళ కళ్లు కనుపించని నిశీధుడూ, సంధ్యాకుమారుడూ ఉదయనుడివెంట ఎలా వెళ్లకలిగారు? ఇంతకూ వాళ్లు రాకుమార్తెలను కనుక్కొనగలిగారా? ఈ వింత విషయాలన్నీ వచ్చేనెల చదవండి.






# ఏనుగుల పంపకం

మన దేశపు పడమటి కనుమలలో పెద్ద పెద్ద అడవులు చాలా ఉన్నాయి. ఆ అడవులలో బలిష్ఠమైన ఏనుగులు గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉంటాయి. కాబట్టి అరణ్యాలలో తిరిగేవాళ్ళు ఆ యేనుగుల్ని మాటువేసి పట్టుకుని వాటిని సాదుచేసి, తీసుకుపోయి ఏ మహారాజుకో లేక మఠాధిపతికో, దేవాలయానికో లేదా సర్కసు వాళ్ళకో బోలెడంత వెలకు అమ్మి డబ్బు చేసుకుంటారు. ఈవిధంగా డబ్బుచేసుకుంటూన్న వాళ్ళలో బాసప్ప అనేవాడు ముఖ్యుడు.

బాసప్పకి కరియప్ప, తాణప్ప, చెంగప్ప అని ముగ్గురు కొడుకులుండేవారు. వాళ్ళు చిన్నప్పటినించీ యేనుగుల్ని పట్టుకోడంలో తండ్రివద్ద తరిఫీదై, మంచి నేర్పు సంపాదించారు. బాసప్ప క్రమంగా ముసిలివాడై జవసత్వాలుడిగి కాలు కదపలేని కాలం వచ్చేసరికల్లా కొడుకులు ముగ్గురూ అందివచ్చి, యేనుగుల వ్యాపారం అడ్డిపోకుండా సాగించారు.

బాసప్ప బాగా ముసిలివాడై, ఆఖరికి ఈ లోకం విడిచి వెళ్ళిపోవలసిన రోజు వచ్చింది. అతడు అవసాన సమయాన తన ముగ్గురు కొమాళ్లనూ దగ్గిరకు పిలిచి, "అబ్బాయిలూ, నేను యిక కొద్దిక్షణాలలో మిమ్మిల్ని వదిలిపోతున్నాను. నేను మీకు యిచ్చిపోగల ఆస్తి ఏమీలేదు. మనకు వున్న ఏనుగలే మన ఆస్తి. వాటిని మీలో మీరు యిలా పంచుకోండి. కరియప్పా, నువ్వు సగం తీసుకో. తాణప్పకి మూడో వంతు యివ్వు. చెంగప్పకి తొమ్మిదోవంతు యివ్వు" అని చెప్పి, ప్రాణం వదిలేశాడు.

మనలో సాధారణంగా తండ్రియొక్క ఆస్తిని కుమాళ్ళు సమంగా పంచుకోడం మామూలు. కాని ఆ అడవుల్లో ఉన్న

సి. జ్ఞానాంబ, విజయవాడ



వాళ్ళకి ఇటువంటి అచారం ఏమీ లేదు. పోతూ పోతూ తండ్రి యేవిధంగా పంచుకోమంటే అవిధంగా పంచుకోటమే వాళ్ల అచారం. 'నాకు తక్కువిచ్చాడు, నీకు ఎక్కువిచ్చాడు' అని వాళ్లు తగవులాడుకోరు సరిగదా, పక్షపాతం జరిగిందే అన్న బాధ మనస్సులోకూడా పెట్టుకోరు. బాసప్ప కుమాళ్ళుకూడా ఇలాంటి తగవులేమీ పడలేదు. తండ్రికి కర్మకాండలు అన్నీ జరిపి వచ్చి, తండ్రి చేసిన నిర్ణయం ప్రకారం తమకున్న ఏనుగుల్ని పంచుకుపోబోయారు. కాని ఒక్క చిక్కొచ్చింది. ఏమిటీ అంటే, మొత్తం వాళ్ళవద్ద వున్నవి పదిహేడు ఏనుగలు. పెద్దకొడుకు కరియప్ప తనకు తండ్రి నిర్ణయించిన సగం వాటా యేనుగుల్ని తీసుకు పోదా మనుకునేటప్పటికి, పదిహేడులోసగం వాటా తెగింది కాదు. ఆ చిక్కే తాణప్పకీ చెంగప్పకీ వచ్చింది. తాణప్పని మూడోవంతూ, చెంగప్పని తొమ్మిదోవంతూకదా పుచ్చుకోమని తండ్రి చెప్పేడు? పదిహేడులో మూడోవంతూ, తొమ్మిదోవంతూ కూడా సరిగ్గా తెగవుగా మరి! కాబట్టి గొప్ప చిక్కే ఇది.

ఇది విడదియ్యటం ఎలాగా అని వాళ్లు చాలాసేపు ఆలోచించారు. అఖరికి కరియప్ప, 'ఎందుకర్రా, ఇంత ఆలోచన? పదిహేడులో సగం ఎనిమిదిన్నర. ఎనిమిదేనుగులూ, ఒక యేనుగులో సగమూను. తొమ్మిదో యేనుగుని రెండు ముక్కలుగా కోసి ఒకముక్క నాకిచ్చెయ్యండి. సరిపోతుంది,' అన్నాడు.

'అ పద్ధతిలో మాకు ఎన్నివస్తాయి?' అనితమ్ముళ్లు తాణప్పా, చెంగప్పా అడిగేరు.

'నీకు ఐదేనుగులూ, కొన్నిముక్కలూ వస్తాయి' అని తాణప్పకీ, 'ఒక యేనుగా కొన్ని ముక్కలూ వస్తాయి' అని చెంగప్పకీ చెప్పేడు కరియప్ప. 'సరే, కానియ్య,'

అన్నారు తమ్ముళ్ళిద్దరూ. కరియప్ప, 'ఎనిమిదీ, ఐదూ, ఒకటీ చేరి పధ్నాలుగు' అని లెక్కవేసి వాటిని వరసగానిలబెట్టి, మిగిలిన మూడు ఏనుగుల్ని ముక్కలు చేయటానికని కత్తి పుచ్చుకు సిద్ధమయాడు.

సరిగ్గా ఆ సమయానికి రాజుగారొకరు తమ యేనుగును ఎక్కి ఆ అడవిలోకి వేటకి వచ్చారు. యేనుగుల్ని చంపటానికి కత్తి పుచ్చుకుని సిద్ధంగా ఉన్న కరియప్పను చూసి, ఆయన 'ఏమిటబ్బాయి ఇదంతాను? ఎందుకోసం ఈ యేనుగుల్ని చంపబోతున్నావు?' అని ఆశ్చర్యంగా అడిగేడు.

వాళ్లు సంగతంతా ఆయనకి వివరంగా చెప్పేరు. ఆయన మనస్సులో, 'ఎంత మూర్ఖులర్రా మీరు! వాటాలు తెగలేదని నిక్షేపంలాంటి ఏనుగుల్ని చంపుకోబోతున్నారా!' అనుకుని, వాళ్లు 'వద్దు'అంటే వినే రకాలుగా కనపడక పోవటంవల్ల, ఆ మూడు యేనుగుల్నీ రక్షించటానికని ఒక చక్కటి యెత్తువేశాడు.

'మీరు మీ తండ్రిమాట తూ.చ. తప్పకుండా ఈ యేనుగుల్ని పంచుకోవటం చాలా బాగుంది. మీ పితృభక్తికి నేను




ఎంతైనా మెచ్చుకుంటున్నాను. మెచ్చుకుని మీకు బహుమానంగా నా యేనుగుని కూడా ఇచ్చేస్తున్నాను. ఆ పదిహేడింటితో పాటూ దీన్ని కూడా చేర్చి, మీ తండ్రి చెప్పిన ప్రకారం పంచుకోండి. అప్పుడు మీకు వాటాలుకూడా సరిగా తెగుతాయి' అని సలహా చెప్పాడు.

వాళ్ళు ఆయన ఔదార్యానికి సంతోషించి, రాజుగారి యేనుగును పుచ్చుకుని మొత్తం పద్దెనిమిదింటిని ఒక వరసలో నిలబెట్టేరు.

తండ్రి చెప్పిన ప్రకారం తనకు సగం రావాలి గనక, పెద్దవాడైన కరియప్ప

పద్దెనిమిదిలో సగం తొమ్మిది కనక, తొమ్మిది ఏనుగుల్ని తోలుకుని తన దారిని పోయాడు.

తర్వాత తాణప్ప పద్దెనిమిదిలో మూడో వంతు ఆరు ఏనుగుల్ని తోలుకుని మరో దారిని వెళ్ళేడు.

చిట్టచివరకు చెంగప్ప పద్దెనిమిదిలో తొమ్మిదో వంతు రెండు ఏనుగుల్ని తోలుకుని ఇంకోదారిని వెళ్ళిపోయాడు.

వెళ్ళేటప్పుడు వాళ్ళు ముగ్గురూకూడా ఎంతో సంతోషంగా వెళ్లేరు. ఏమంటే, ఎనిమిదేనుగులూ ఒక ముక్కా మాత్రం వస్తుందనుకున్న కరియప్పకి యిప్పుడు తొమ్మిది యేనుగులు వచ్చాయి. ఐదేనుగులూ, ముక్కలూ వస్తాయనుకున్న తాణప్పకి ఆరు ఏనుగులు వచ్చాయి. ఒకే ఒక్క యేనుగా, ముక్కలూ వస్తాయనుకున్న చెంగప్పకి రెండు ఏనుగలొచ్చాయి. కనపడ్డ వాళ్ళందరితోటీ, ఆ ముగ్గురన్నదమ్ములూ కూడా, 'ఫలానా రాజుగారు తమ యేనుగుని మాకు ఇచ్చేశారు!' అని గొప్పగా చెప్పుకున్నారు. కాని, జరిగిన గమ్మత్తు గ్రహించనేలేక పోయారు. ఆ గమ్మత్తు యేమిటీఅంటే:

కరియప్పవి తొమ్మిదీ, తాణప్పవి ఆరూ, చెంగప్పవి రెండూ కలిపితే మొత్తం యేనుగులు పదిహేడేకద! కనుక రాజుగారి యేనుగ రాజుగారికే మిగిలిపోయిందన్న మాట. లెక్క సరిపెట్టడంకోసం ఆయన తమ యేనుగును వాళ్ళ ఏనుగులతో కలిపి, మనస్సు తృప్తిపరిచాడు.

రాజు చేసిన యుక్తివల్ల ఆ ముగ్గురన్నదమ్ములమధ్య ఏవిధమైన పేచీ రాకుండా వాళ్ల తండ్రి చెప్పిన ప్రకారం ఏనుగుల వాటాలు కుదరటమేకాక, వాళ్ళ మూర్ఖత్వం వల్ల అన్యాయంగా చచ్చిపోవలసిన ఆ మూడు ఏనుగులకూ ప్రాణ రక్షణకూడా జరిగింది.





# కటికవాని గుండె

అనగనగా ఝుంకారుడనే ఒక కటిక వాడు ఉండేవాడు. వాడురోజుకి ఏభై పశువులనైనా అవలీలగా వధించగలిగేవాడు.

ఝుంకారుడికి ఇది తరతరాలా వస్తున్న కులవృత్తి కావడంచేత, దయా, దాక్షిణ్యమూ, కనికరమూ, అంతఃకరణ అనేవి వానికి ఏకోశానా లేకపోయినై.

ఇన్ని జీవాలు తీసిన ఝుంకారునికి లేక లేక ఒక్క కూతురు పుట్టింది. ఆపిల్ల దేవీ కటాక్షంవల్ల పుట్టడంచేత అంబ అని పేరు పెట్టుకొని, అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు. అంబ పుట్టిన క్షణంనించీ ప్రేమ అంటే ఏమిటో, అభిమానం అనేది ఎలా ఉంటుందో వాడికి తెలిసివచ్చింది.

అంబ పెరిగి పెద్దదయింది. ఆమె అందవతి, అంతకుమించిన గుణవతిన్నీ. పైగా జాలిగుండె కలది. ఆమెనుచూచి, ప్రజ 'ఆహా! ఝుంకారుని అదృష్టం ఏమి అదృష్టం!' అని సంతోషించేవారు. ఆమె ఎన్నడూ మాంసం నోటబెట్టకపోవటం చూచి లోకులు మరీ అబ్బురపడేవాళ్ళు.

ఒకరోజున ఝుంకారుడు అంగడిలో ఉండే సమయమందు ముద్దులు మూటకట్టే ఒక ఆవుదూడను ఎవరో యింటికి తీసుకువచ్చి అమ్మజూపారు. దానినిచూచీ చూడడంతోనే అంబ, దాని యజమానికి కోరిన ధనమిచ్చి కొనుక్కున్నది. సాయంకాలం ఝుంకారుడు యింటికి వచ్చేసరికి, అంబ ఆవుదూడతో ఆడుకొనటం చూచి, ఆశ్చర్యపడ్డాడు. ఆమె ఏమి చేసినా అతనేమీ అనడు. కనుక, ఇలా ఆమె ఆడుతున్నందుకుకూడా ఏమీ అనలేదు.

కాని, అతను అడగకుండానే ఆడుకొంటూవున్న అంబ, తండ్రిని చూచినదే అతన్ని చుట్టేసుకుని "నాయనా!—ఎంత ముచ్చటగా వున్నదో చూడు ఈ ముద్దుల

కర్రి కాశీసత్యనారాయణ, అనకాపల్లి




తువ్వాయి! దాని మూపురం చూడు, గంగడోలు చూడు, మెరిసిపోయే ఆ కన్నులు చూడు. దాని అమాయికపు చూపులు చూడు...' అనేటంతలో దూడవచ్చి, అంబ ఒళ్ళు నాకజొచ్చింది. ఆమె గబుక్కున "నా చిన్నారిగున్నా!—ఎంత ప్రేమే నీకు. ఎంత అభిమానమే. నువ్వెవరివే, నేనెవరినో. మనకుగల సంబంధమేమిటి? నీకు నోరు పెట్టలేదుగదా ఆమాయదారి దేవుడు. ఐనా, నువ్వు చెప్పినమాట నాకు తెలిసిందిలే.... నన్ను ఎందుకు నాకుతున్నావో అర్థమైందిలే" అంటూ దానిమెడ గట్టిగా చుట్టేసుకొని ముద్దులాడింది.

అంబ మాటలూ, చేష్టలూ, దూడతో పలికే పలుకులూ ఝుంకారుడికి వింత గొలిపాయి. దూడతో ఆడుతున్న అంబ మళ్ళీ తండ్రిని చుట్టేసుకొని "నాన్నా!—నా తువ్వాయి చూడు! నన్ను పేరుపెట్టి 'అంబా' అని పిలుస్తున్నది! దానికి నా పేరెలా తెలిసిందో! నువు చెప్పావా?—అవునుగాని, నేనొక మాటంటాను, నీకు కోపం వస్తుందేమో!" అన్నది.

"కోపమెందుకు తల్లీ, ఎప్పటికీ రాదు" అంటూ ఆమెను దగ్గఱకు తీసుకొన్నాడు.

"మరైతే విను: మిసమిసలాడే పశువులను, నవనవలాడే లేగలనూ విసుగూ విరామమూ లేకుండ చంపి చంపి, నీ చేతులు మైలపడిపోయినై. ఆ పాపపు చేతులతో నా తువ్వాయిని ముట్టుకునువ్వు తాకవద్దు. తెలిసిందా? తాకనని ఒట్టేసుకో" అంటూ తండ్రి చెయ్యి తన చేతిలో వేసుకుంది. ఈమాట వినగానే ఝుంకారుని హృదయంలో కలవరం బయలుదేరింది.

* * *

ఒకనాటి అర్ధరాత్రి అందరూ గాఢంగా నిద్రిస్తూవున్న సమయంలో ఎవరో తలుపు తట్టారు. రెండు మూడుసార్లు అలా తట్టే

సరికి ఝుంకారుడు లేచి తలుపు తీశాడు. చూడగా అతను గ్రామాధికారి. గ్రామాధికారిఅంటే ఊరందరకూ హడలే! అందుచేత ఆయన ఈ అపరాత్రివేళ స్వయంగా రావటం చూడగా ఝుంకారుడికి కంగారు పుట్టింది. "చూడు ఝుంకార్!—తలవని తలంపుగా ఇప్పుడు నాకు ప్రాణస్నేహితులు వచ్చి ఉన్నారు. నీవద్దగల ప్రశస్తమైనమాంసం ఎంత ఉంటే అంతా ఇదుగో మా నవుకరు చేతికియ్యి. ముఖ్యమైన విషయం కనక నేనే వచ్చాను" అన్నాడు.

ఝుంకారునికి పచ్చి వెలక్కాయ గొంతున పడింది. ఆ రోజున అదేమోకాని కొట్టిన మాంసమంతా ఒక్క తునకకూడా మిగలకుండా విక్రయమయిపోయింది.

ఎన్నడూ తన గుమ్మం తొక్కి ఎరుగని అధికారికి ఏం జవాబు చెప్పకోవటం?— "బాబయ్యా! — నేనే పట్టుకువచ్చి దాఖలు చేసుకుంటాను. తమరు పదండి" అన్నాడు ఝుంకారుడు.

"కాదు నేనిక్కడే వుంటాను. స్వయంగా తీసుకు వెళ్ళాలి. వెంటనే ఏర్పాటు చెయ్యి" అంటూ అధికారి అక్కడనే భీష్మించుకొని కూర్చున్నాడు.



గత్యంతరంలేక, ఝుంకారుడు అంబ పెంచే లేగను విప్పి కమేలాకు ఈడ్చుకు పోబోయాడు. లేగ 'అంబా అంబా' అని జాలిగా రెండుసార్లు అరిచింది. నిద్రిస్తున్న అంబ ఉలిక్కిపడి లేచింది. తువ్వాయి కోసం చూచింది. కనపడకపోయేసరికి, ఒక్క అంగలో అడ్డుదారిని పరుగెత్తి కమేలా చేరుకుంది. తన మెడను కత్తుల మధ్య దూర్చింది. ఇంతలో లేగనీడ్చుకొంటూ ఝుంకారుడు గబ గబా వచ్చేశాడు. కత్తి ఎత్తబోయాడు. తన చిన్నారి అంబ అక్కడ కంట పడగానే కెవ్వుమని ఒక పెద్దకేకవేసి, చాపకట్టుగా పడ్డాడు.

కొంతసేపటికి స్మృతివచ్చి, ఝుంకారుడు లేచాడు. తన ముద్దుల కూతురును కరకు కత్తులనుండి తప్పించబోయాడు. కాని, ఆ బాలిక ఎంతకూ యివతలికి రాలేదు. "ముందు నన్ను చంపు, తర్వాత నా తువ్వాయిని చంపుదువుగాని. నువు నన్ను ద్రోహం చేశావు నాన్నా! ద్రోహం చేయటం జీవహింసకంటెకూడా ఎక్కువైన మహాపాపం. ముందు నన్ను చంపి, తరువాత నా తువ్వాయిని చంపు...." అన్నది.

ఝుంకారుడు "నిజమే అంబా! నిజమే నువు చెప్పినదంతా నిజమే!" అంటూ మళ్ళీ పడిపోయాడు. ఎంతసేపటికీ ఝుంకారుడు రాకపోయేసరికి, అక్కడ యింటి వద్ద కనిపెట్టుకొనివున్న గ్రామాధికారి కారాలు, మిరియాలు నూరుతూ కమేలాకు వచ్చేశాడు. వచ్చిచూడగా, అతనికేమీ అర్థంకాలేదు. ఝుంకారుడు తేరుకున్న తరువాత సంగతి సందర్భాలన్నీ వెల్లడైనాయి. లేగదూడ 'అంబా!' అని అరిచింది. అంబ లేచివచ్చి, దాని మెడ చుట్టేసుకుంది. ఝుంకారుడు అంబనూ, లేగనూ కూడా చేరదీసుకున్నాడు. "బాబయ్యా! నేను నావృత్తి మానివేశాను, క్షమించండి" అంటూ అధికారికి రెండు చేతులా నమస్కరించాడు.

అంబ త్యాగము చూచి, ఆమె వాక్కులు వినేసరికల్లా అధికారికికూడా మనస్సు మారిపోయింది. "ఝుంకార్! నీవు నీవృత్తి మానివేస్తే, నేను మాంసాహారం మానివేస్తున్నాను. నేనేకాదు, నా మిత్రు లందరిచేతా మాన్పించివేస్తాను. అంతేకాదు, ఈ క్షణంనించీ, పశురక్షణకు పూనుకుంటానని అంబసాక్షిగా ప్రమాణం చేస్తున్నాను" అనిచెప్పి, ఒకవిధమైన క్రొత్త ఆనందంతో యింటికి మరలిపోయాడు.



# అపూర్వ ముత్యం

మాళవదేశాన్ని ఏలే భూపసింహుడికి ఒకే ఒక్క కుమార్తె. ఆమెపేరు సురూప. సురూప అందాల బరిణె. ఆమెను వివాహ మాడాలెనని ఎంతోమంది రాకుమారులు ఉవ్విళ్ళూరుతుండే వారు. కాని, అపురూప సౌందర్యరాశి అయిన తన కుమార్తెను, అంద చందాలతోపాటు శౌర్యసాహసాలుకూడా కలిగిన రాకుమారునికే యివ్వాలెనని భూపసింహుడు నిశ్చయించుకున్నాడు. ఈపని నెరవేరటానికని రాజు ఒక ఆలోచన చేశాడు.

అది ఏమిటీ అంటే—భూపసింహుడి వద్ద ఒక అపూర్వమైన ముత్యం వున్నది. అది ధాదాపు బాతుగ్రుడ్డంత వున్నది. ఈ ముత్యాన్ని పోలిన మరొక ముత్యాన్ని ఎవరైతే తీసుకురాగలుగుతారో వాళ్ళకి తన కుమార్తెను ఇద్దామని నిశ్చయానికి వచ్చాడు. అదేప్రకారం ఆయన ఆ చుట్టు ప్రక్కల రాజ్యాలలో ప్రకటించాడు. ఎంతో మంది రాకుమారులు 'మేము తెస్తాము' అంటూ బయలుదేరి వెళ్ళారే కాని వెళ్ళిన వాళ్ళలో ఒక్కరూ తిరిగి రాలేదు.

చివరికి నర్మదుడనే రాకుమారుడు ఈ సాహస కార్యానికి పూనుకొని ముందుకు వచ్చాడు.

నర్మదుడు బయల్దేరిపోయి పదిక్రోసులు సాగి మార్గాయాసంచేత ఒక చెట్టుకింద చతికిలబడ్డాడు. అలా ఒకసారి పైకి చూచే సరికి చెట్టుమీద రెండు నీలకంఠపక్షులు కనపడినై. అవి దుఃఖంలో ఉండటం కని పెట్టి, నర్మదుడు వాటి మంచిచెడ్డలు అడిగే వరకు, తమకుగల ఒక్కగా నొక్కబిడ్డను ఉదయాన్నే ఒక వేటగాడు తీసుకపోయాడనీ, అదే తమ దుఃఖకారణమనీ చెబుతూ, వాడు పోయిన దిక్కుకూడా ఆ పక్షులు ఆనవాలు చెప్పినై.

ఆర్. శ్రీనివాసరావు, మైసూరు



వెంటనే నర్మదుడు, పక్షులు చెప్పిన దిక్కుగా పోయి, ఎలానో వేటగాని జాడ కనుక్కున్నాడు. 'బాబూ, నాయనా! పథ్యానికి కావాల్సి వచ్చింది. ఒక్క నీల కంఠపక్షిని ఇచ్చి పుణ్యం కట్టుకో'మంటూ బ్రతిమాలేటప్పటికి, వేటగానికి మనసు కరిగి ప్రొద్దుట పట్టిన నీలకంఠపక్షిని తెచ్చి ఇచ్చాడు. నర్మదుడు వానికి రెండు వరహాలు బహుమతిచేసి, పక్షి దంపతుల ముద్దుబిడ్డను తెచ్చి ఒప్పగించేసరికి, వాటి ఆనందానికి మేరలేకపోయింది.

ఆ పక్షులు అప్పుడు "ఓయి నర్మదా!- నీవు చేసినమేలు ఈ జన్మలో మరువ లేము. మావల్ల నీకు కావలసిన పని చెప్పు. ఈవిధంగా కొంచెమైనా నీ ఋణం తీర్చు కోవటానికి ప్రయత్నిస్తాము" అని అతనిని వేడుకొన్నాయి.

అందుకు నర్మదుడు, తను బయల్దేరిన పనిని గురించి వివరాలు చెప్పగా, 'నర్మదా!—నీకు కావలసిన ముత్యం యొక్క పుట్టుపూర్వోత్తరాలు మాకు తెలుసు. త్యాగమూర్తివైన నీకు ఈ రహస్యం చెప్పటంవల్ల ప్రపంచానికీ ఉపకారమవుతుంది, మేమూ తరిస్తాము" అనగానే నర్మదుడు శ్రద్ధగా కూర్చుని వాటి మాటలు ఆలకించసాగాడు.

"ఓయి నర్మదా!—పూర్వకాలమందు మానసరోవరంలో విహరించే ఒక హంస సరస్సు గట్టున గుడ్లు పెట్టుతూ వుండేది. అవి యెండలో ఎండి, ఈ ముత్యాలుగా తయారయేవి. ఆ గుడ్లలో ఒకటి జరాసంధుని దగ్గర వుండేది. కాలక్రమాన అతని ఖజానా భూపసింహునికి చిక్కింది. అందులో దొరికిన ఆ ముత్యమే ఇప్పుడు అతనివద్ద ఉన్నది. ఈ ముత్యానికి జత ఐనది కిన్నెరరాజైన కుబేరునివద్ద ఉండేది. దానిని కుబేరుడు సామంతుడైన విరూపా



క్షునికి బహుమతి చేశాడు. విరూపాక్షుడు ఇప్పుడు సింహళద్వీపాన్ని పాలిస్తూ వున్నాడు. ఈ ముత్యం పుట్టుపూర్వోత్తరాలు ఎవరైతే చెప్పగలరో వారికి అర్ధరాజ్యంతోసహా ఆ ముత్యాన్నీ తన కుమార్తెనూ ఇస్తానని ప్రతిజ్ఞ చేశాడు. మొత్తం ప్రపంచంలో ఇలాంటి ముత్యాలు ఆ రెండే ఉన్నాయి. తరువాత పరమశివుని ఆజ్ఞవల్ల ఆ హంసలు గ్రుడ్డు పెట్టడం మానివేశాయి. అందుచేత భూపసింహుని వద్దనున్న ముత్యానికి జతపడే ముత్యం సింహళ ద్వీపంలో తప్ప మరెక్కడా దొరకదు," అని నీలకంఠ పక్షులు చెప్పాయి.

నర్మదుడు ఆ నీలకంఠపక్షులకు కృతజ్ఞత తెలిపి, తిన్నగా సింహళద్వీపానికి బయల్దేరాడు.

కొంతదూరం వెళ్ళిన తరువాత అతను ఆకలిదప్పులకు ఓర్వలేకపోయాడు. కొంచెందూరాన మండుటెండలో తెల్లగా ఏదో తళతళ మెరుస్తూ కనిపించేసరికి, అది నీరు ఐవుంటుందనుకొని, ఎలాగో ఆ స్థలం చేరుకున్నాడు. తీరా చూడగా అది ఒక మహాసర్పం! ఇంత సుందరమైన సర్పాన్ని చంపటానికి చేతులు రాక నర్మదుడు ఆలోచనతో అలాగే నిల్చునివుండగా చుట్టలు చుట్టుకొనివున్న ఆ మహాసర్పం అతన్ని మానవభాషలో పలకరించి, కుశల ప్రశ్నలు అడిగి, 'నీకు నీళ్ళుచూపిస్తాను నాతో ర'మ్మంటూ ఒక చీకటి గుహకు తీసుకపోయింది.

ఆ గుహ దాటగానే చక్కటితోటా, పెద్ద భవనమూ కనిపించినై. అనేకమంది గంధర్వ కుమారులు అర్ఘ్యపాద్యాదులు పట్టుకవచ్చి నర్మదుని పూజించారు. నర్మదుడు సేద తీర్చుకుని అలా ఎవటు చూచేసరికి తనవెంటవచ్చిన మహాసర్పంకూడా ఒక గంధర్వునిగా మారిపోవటం గమనించి




ఆశ్చర్యపడి, అతని చరిత్ర చెప్పమని కోరాడు. అందుకు ఆ గంధర్వుడు 'శాపవశాన నేను ఈ సర్పరూపం ధరించవలసి వచ్చింది. నీ దర్శనంవల్ల నాకు శాపవిముక్తి అవుతుందని మా గురువుగారు చెప్పారు. అందుకనే ఇప్పటివరకూ నీకోసం కాచుకొని వున్నాను' అనిచెప్పగా, ఇదివిని నర్మదుడు చాలా సంతోషించాడు.

తమ రాకుమారునికి శాపవిముక్తి కల్గినందుకు ఆరోజున గంధర్వనగరమంతా ఎంతో సందడిగా వున్నది. మరునాడు, నర్మదుడు వారికి నమస్కరించి 'సెలవు తీసుకుంటా'ననగా, వారు ఎంతగనో ఉచిత మర్యాదలతో అతనిని కొన్ని యోజనాల దూరంవరకు సాగనంపారు. అంతేకాదు, ఎప్పుడు నర్మదుడు నడక సాగించటం కష్టమనుకుంటే అప్పుడు తమని తలుచుకుంటే ఒక రెక్కలగుఱ్ఱం ప్రత్యక్షమయేట్టు వరం యిచ్చారు.

నర్మదుడు మళ్లీ బయల్దేరి పోతూవుండగా, దారిలో దిగులుగా కూర్చునివున్న ఒక కిన్నెరకుమారుడు కనుపించి యిలా చెప్పసాగాడు. 'సింహళదేశపు రాజు కుమార్తెయొక్క అపురూప సౌందర్యాన్ని గురించి విని, పెళ్ళాడాలెనని నిశ్చయించుకొన్నాను. కాని, ఆ రాజు తన ఖజానాలోనించి బాతుగ్రుడ్డంత ముత్యం తెప్పించి, 'దీని పుట్టు పూర్వోత్తరాలు చెప్పకోగలిగినవానికే నా కుమార్తెను ఇస్తా' నన్నాడు. అందుచేత ఏమి చేయటానికీ పాలుపోక ఇక్కడ ఇలా కూర్చున్నాను."

నర్మదుడు ఆకిన్నెర కుమారునికి ధైర్యం చెప్పి, తనవెంటరమ్మన్నాడు. ముందున్నది రాక్షసుల దేశం గనుక, తగిన జాగ్రత్తలో ఉండాలని నర్మదుడు గంధర్వులని తలుచుకున్నాడు. వెంటనే ఒక రెక్కల గుఱ్ఱం వాళ్ళ ఎదట ప్రత్యక్షమైంది.

ఇక భయమేముం దనుకొని, వారిద్దరూ ఆ గుఱ్ఱంమీద ఆకాశమార్గాన ఎగిరి, అనేక చిత్రాలు చూచుకొంటూ పోయి ఒక పెద్ద అడవిలో దిగారు.



దిగి, గుర్రాన్ని ఒకచోట కట్టివేసి, ఫలాలు ఏమైనా దొరికితే తిందామని చెట్ల కిందకు పోయారు. ఇంతలో ఒక రాక్షస గుంపు వచ్చి వారిని పట్టుకొని "బలే బలే! ఇన్నాళ్లకు మన రాజుకు మళ్లీ నర మాంసం దొరికింది!!" అంటూ, సంతోషంతో తీసుకపోయారు. ఈ వార్త తెలిసి ఆ రాక్షసరాజు 'వీరిని జాగ్రత్తగా ఉంచండి. ఎల్లుండి ఆరగిస్తాను' అనగానే భటులు వారిని ఖైదుచేసి వుంచారు.

నర్మదుడు తను పట్టుబడినందుకు విచారించలేదుకాని, నిష్కారణంగా కిన్నెర కుమారునికి తనమూలాన ప్రాణాపాయం కలిగిందే అని చాలా దుఃఖించాడు. ఐతే, వీళ్ళిద్దరనూ చూచినప్పటినించి వృద్ధుడైన కాపలావానికి వారిని గురించి ఒక మంచి భావం ఏర్పడి, అందరూ నిద్రించగా చూచి వాళ్ల చరిత్ర అడిగి తెలుసుకున్నాడు. నర్మదుడు ఉన్నది ఉన్నటు చెప్పగానే వాడి మనస్సు కరిగిపోయి, వెంటనే వారినివిడిచి పెట్టి, 'పోయిరండి, బాబూ!—మీకు జయమవుతుంది!' అంటూ దీవించాడు.

అపరిమితమైన సంతోషంతో వారు తమ రెక్కల గుర్రాన్నిఎక్కి మళ్లీ ప్రయాణం సాగించి, ఒక పట్టణం కనపడేవరకు, అక్కడ దిగారు. వారు దిగీ దిగటంతోనే కొంతమంది భటులు వారిని బంధించి, ఆ దేశాచారప్రకారం రాజు ఎదట నిలబెట్టారు. తీరా చూడగా, ఇది వారు వెళదామనుకొంటున్న సింహళద్వీపమే అని తేలింది. రాజు రెండే రెండుమాటల్లో వారి సంగతి సందర్భాలు తెలుసుకుని, రాచమర్యాదలతో వారిని సత్కరించాడు.

కొంచెం స్తిమితపడగానే నర్మదుడు తాను నీలకంఠ పక్షులవల్ల విన్న వృత్తాంతమంతా పూసగ్రుచ్చినట్టు చెప్పేసరికి, కిన్నెర కుమారుడు ఆశ్చర్యభరితుడైనాడు. రాజు సంతోషం పట్టలేక, స్వయంగా దిగివచ్చి, నర్మదుణ్ణి చేయిపట్టుకు తీసుకవెళ్ళి సింహాసనంమీద తన పక్కని కూర్చోబెట్టుకుని, తన శపథాన్ని వెల్లడించాడు.

ఇందుకు నర్మదుడు "మహారాజా! — నీ మాటలకు నాకు ఆనందమైంది. ఐతే, ఈ కిన్నెరకుమారుని కోరిక తీర్చాలెనని నేను మనసులో నిశ్చయించుకొనివున్నాను. కనుక, అపురూపమైన ఈ ముత్యం నాకు చాలు. అందాల బరిణె ఐన నీ కుమార్తె అనే ఆణిముత్యాన్ని ఈ నా స్నేహితుని కిచ్చినట్టయితే చాలా సంతోషిస్తాను" అని చెప్పగానే, నర్మదుని హుందాకూ, ఉపకారబుద్ధికీ మెచ్చుకుని, సింహళరాజు తన కుమార్తెను ఆ కిన్నెర కుమారునికిచ్చి వివాహం చేశాడు. తర్వాత నర్మదుని కోరిక ప్రకారం, తనవద్దనున్న ఆ ముత్యాన్ని ఆప్యాయంతో ఆతనికిచ్చి సాగనంపాడు.

ఈవిధంగా అనేకమైన శ్రమదమాదులకు ఓర్చి అపూర్వమైన ముత్యాన్ని సంపాదించటమే కాక, కిన్నెర కుమారునికి తను అనుకోకుండా చేయగలిగిన సహాయానికి నర్మదుడు ఎంతో సంతోషించి, ఆతని అచ్చటనే వదిలి తను తిరిగి మాళవదేశం చేరుకున్నాడు.

ఇన్నాళ్ళకు తన ముద్దుల కుమార్తెకు తగిన వరుడు లభించినందుకు భూపసింహుడు కూడా ఎంతో ఉప్పొంగిపోయాడు. ఆవెంటనే ఒకసుముహూర్తాన ఆకాశమంత పందిరికింద భూదేవంత అరుగు వేసి, వారిద్దరికీ అతివైభవంగా వివాహంచేశాడు. దంపతులిద్దరూ చిలుకా గోరింకలలాగా హాయిగా కాలం గడుపుతున్నారు.





# తెలియక చేసిన పుణ్యం

పూర్వకాలమందు కాశీనాధుడనే ఒక యతీశ్వరుడు ఉండేవాడు. ఆతనికి ఇవ్వటమేకాని పుచ్చుకోనటమనేవి తెలియదు. ఇలా చేస్తున్నామనే విషయం స్ఫురణ లేకుండానే కాశీనాధుడు రోజూ లోకానికి ఎన్నెన్నో ఉపకారాలు చేస్తూ ఉండేవాడు.

తమకు తెలియకుండానే సూర్యచంద్రులు ఎలా మనకు వెలుగునిస్తున్నారో, ఎటువంటి ప్రతిఫలమూ కోరక పువ్వులు మనకు వాటి పరిమళాలను ఎలా వెదజల్లుతున్నాయో, అలానే కాశీనాధుడు తనకు తెలియకుండానే లోకానికి మంచి చేసేవాడు.

ఈ విధంగా కాశీనాధుడు చేస్తూవచ్చిన పుణ్యంతో స్వర్గలోకమంతా నిండిపోయింది! ఇది చూచి దేవగణమందరూ ఆశ్చర్యపోయారు! 'మానవమాత్రుడేమిటి, ఇంతటి పుణ్యం చేయగలగడమేమిటి? దీని రహస్యమేదో తెలుసుకోవాలి' అని తలిచి, దేవదూతలు ఒకనాడు విమానం మీద అతన్ని తమ లోకానికి రప్పించారు.

వారు కాశీనాధునికి సమస్తమైన మర్యాదలూ చేసి. "మహానుభావా!—నీవు చేసిన సుకృతం ఇంతింతకాదు. దీనికిగాను నీవు ఏమి కోరుకుంటే అది నెరవేర్చటానికి సిద్ధంగా వున్నాము" అని చెప్పారు. వారు ఎన్నివిధాల అడిగినా, యతీశ్వరుడు "నాకేమీ అక్కరలేదు" అని అంటూ వచ్చాడు.

అప్పుడు దేవదూతలు "ఏమయ్యా స్వామీ!—నీవు నీ చేతులతో ఎవరినితాకితే వాళ్లకు వ్యాధులు నయమై, ఆరోగ్యవంతులయ్యేటట్టు చేయమన్నావా?" అన్నారు.

"వద్దు బాబూ!—అటువంటి మహిమలు కనపరచటం ఆ సృష్టికర్తకే చెల్లుతుంది కాని, నావంటి మానవమాత్రులకు

ముద్దా సోమప్పశాస్త్రి, పరుశువాకం



తగదు," అంటూ నిరాకరించాడు, కాశీనాథుడు.

"పోనీ. నీకొక ఆకర్షణీయమైన కొత్త స్వరూపం ఇస్తాము. అప్పుడు ప్రజలందరూ నీవద్ద చేరుతారు. వారికి భగవంతుని గురించి బోధచేద్దువుగాని," అని మళ్ళీ చెప్పారు వారు.

అందుకు కాశీనాథుడు "వద్దు వద్దు. జనులు నావద్ద చేరటం ప్రారంభిస్తే దేముణ్ణే మరిచిపోతారు. ఐనా దేముణ్ణి గురించి ఒకరు బోధించేదేమిటి? ఆయన తన సంగతి తనే చూచుకోగలడు!" అని బదులుచెప్పి తప్పించుకోజూచాడు.

"ఐతే-చెడ్డవాళ్ళను మంచివాళ్ళనుగా మార్చే సాధనం ఇస్తాము. దానిని ఉపయోగించావంటే నీకు గొప్ప కీర్తి వస్తుంది. ఏమంటావు?" అని అడిగారు దేవతలు.

"వద్దయ్యా బాబూ!—ఎక్కడో దేవదూతలు చేయవలసిన ఇటువంటి మహత్తర కార్యాన్ని నన్ను చేయమంటారేమిటి?" అన్నాడు కాశీనాథుడు.

"మహాత్మా!—మరి, మేము ఏమి ఇస్తామన్నా వద్దంటావే. నీ అంతట నీవే ఏదైనా కోరుకో" అని బలవంతపెట్టారు దేవదూతలు.

"నాయనా, పరమేశ్వరుని కృపఉంటే చాలు. అంతకుమించి నాకేమీ అక్కర లేదు" అని తప్పుకొన్నాడు, కాశీనాథుడు.

"స్వామీ! నీవు 'ఇవి కావాలీ' అని కోరుకొనక పోయినట్టయితే, మేమే ఆలోచించి ఏదో ఒకటి నీకు ఇవ్వక తప్పదు" అని నిష్కర్షగా చెప్పారు దేవదూతలు.

అందుకు కాశీనాథుడు చిరునవ్వుతో "ఓహో, అలాగా! అయితే, నాకు తెలియకుండానే నేను లోకానికి ఉపకారం చేయగలిగే వరం ఏదైనా అనుగ్రహించండి" అన్నాడు.

అతను ఇలా అడిగేసరికి వాళ్లు కంగారు పడ్డారు. నలుగురూ కలిసి బాగా ఆలోచించి, చివరకు ఒక చిత్రమైన మహిమను కాశీనాధునికి ప్రసాదించారు. యతి నడిచేటప్పుడు వెనుకవైపునా ఇరుపక్కలా నేలమీద అతని నీడ పడుతుండికదా! అతనికి అగపడని ఆ నీడ పడినంతమేరా ఒక మహత్తరమైన ప్రభావం కనపడుతుంది. అది యేమిటీ అంటే—ఆ నీడ తొక్కినవాళ్ళకు ఎటువంటి వ్యాధులైనా నయమైపోతయి. మందులకు కుదరని మనోవ్యాధులుకూడా మాయమయిపోతై. కాబట్టి విచారాలన్నీ తొలగిపోయి, వాళ్ళు హాయిగా వుంటారు.

కాశీనాధుడు భూలోకానికి దిగివచ్చి, మామూలుగా తనదారిని తను నడిచిపోతూ వుంటే—అతని నీడ పడినంతమేరలోనూ బీళ్లు పచ్చబడేవి, మోళ్లు చిగిర్చేవి, ఎండిపోయిన వాగులు స్వచ్ఛమైన జలంతో నిండిపోయేవి, పాలిపోయి కృశించివున్న శిశువులు ఒక్కలిప్తలో తేరుకొని, ఆరోగ్యవంతులై, నవనవలాడుతూ ఉండేవాళ్ళు. ఇలా తమ బిడ్డలలోకలిగిన మార్పుచూచి, వారిని కన్న తల్లులు పొంగిపోయేవాళ్లు.



లోకంలో ఇంతపని జరుగుతూవుంటే ఈ సంగతి కాస్తంతైనా కాశీనాధునికి తెలియనే తెలియదు. తన నీడలో ఇంతటి మహత్తు ఉన్నట్టూ, ఆ మహిమవల్ల లోకానికి గొప్ప ఉపకారం జరుగుతున్నట్టూ కాశీనాధుడు ఎరుగనే యెరుగడు. ఇదే దేవదూతలు చేసిన చిత్రం.

ప్రజలు ఏనాడైతే అతని నీడలోని మహిమను గుర్తించారో అప్పటినించీ—చడీ చప్పుడూ చేయకుండా, యతీశ్వరుణ్ణి మెల్లగా వెంబడించి, అతని నీడ పడిన ప్రదేశంలో ప్రవేశించి, ఎవరికి కావలసిన సౌఖ్యాలు వారు పొందుతూవుండేవాళ్లు.



# తేలుకుట్టిన దొంగ

పూర్వం ఒక ఊళ్లో ధనయ్యా అనే కోమటి ఉండేవాడు. అతనికి భార్యా పిల్లలతోసహా కాశీయాత్ర చేసివద్దామని బుద్ధిపుట్టింది. అప్పటికి అతనివద్ద రెండువందల వరహాలున్నాయి. ఎంత పట్టుకెడితే అంతా ఖర్చు అవుతుందన్న భయంకొద్దీ, నూరు వరహాలు మాత్రమే తీసి మూటగట్టుకుని మిగత నూరూ ఎక్కడైనా దాచుకు వెడదామనుకున్నాడు. ఎక్కడ దాచివెడితే బాగుంటుందీ అనే ఆలోచన తెగక, స్నేహితుడైన సీనయ్యాను సలహా అడిగేడు. అందుకు సీనయ్యా 'ఊరిబయట దెయ్యాలమఱ్ఱికింద కప్పెట్టి వెళ్లు. నీ సొమ్ము ఎక్కడికి పోతుంది గనకా' అని చెప్పేడు.

రాత్రి సద్దణగటంతోనే ధనయ్యా నూరు వరహాలూ తీసుకుని దెయ్యాలమఱ్ఱి వద్దకు బయల్దేరేడు. రాత్రిపూట సొమ్ముతో ఊరి బయటకు ఒంటరిగా వెళ్ళటం మంచిదికాదనిపించి సీనయ్యానుకూడా సాయం తీసుకెళ్లేడు. మఱ్ఱిక్రింద గజంలోతున గొయ్యి తీసి, అందులో నూరువరహాలూ పాతిపెట్టి వాళ్లిద్దరూ తిరిగి చక్కా వచ్చారు.

ధనయ్యా ఆ తెల్లవారుఝామునే కుటుంబంగా కాశీకి బయల్దేరి వెళ్ళిపోయాడు. ఊరువిడిచి వెళ్ళేక అతగాడికి వరహాలను గురించిన యావే లేదు. వాటిని పాతిపెట్టి వచ్చిన సీనయ్యానుమాత్రం అతని భార్య బంగారమ్మ, 'ఎక్కడికి వెళ్ళేవయ్యా ఇంత రాత్రివేళ?' అని అడిగింది. అతడు జరిగిన సంగతంతా చెప్పేడు. వరహాల మాట వినటంతోనే బంగారమ్మకు దుర్బుద్ధి పుట్టి, ఆ వరహాలను తవ్వి తీసుకురమ్మని మొగుణ్ణి వేధించింది. 'నమ్మక స్వామి ద్రోహం చెయ్యమంటావా దుర్మార్గురాలా!' అని సీనయ్యా పెళ్ళాంమీద కోప్పడ్డాడు. కాని బంగారమ్మ 'ఆ వరహాలు తెచ్చావా

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు

సరి సరి, లేకపోతే నూతులో పడి చస్తా' నని భయపెట్టే వరకు నోరెత్తక, రాత్రికి రాత్రి వెళ్లి గొయ్యి తవ్వి వరహాలు తెచ్చి, పెళ్ళానికి సమర్పించాడు. అవిడ ఆ సొమ్ముతో వంటినిండా నగలు చేయించుకుని వయ్యారంగా తిప్పుకుంటూ, 'బంగారమ్మ' అనే పేరు సార్ధకం చేసుకుంది.

ధనయ్య పెళ్లాం బిడ్డలతో కాశీనుంచి తిరిగి వచ్చేటప్పటికి చాలా రోజులు పట్టింది. పట్టుకువెళ్లిన డబ్బు ఖర్చైపోవటంవల్ల, ఇంటికి రావటంతోనే సొమ్ము అవసరమై అతగాడు వచ్చిననాటిరాత్రే మఱ్ఱిచెట్టు వద్దకు వెళ్లి గొయ్యి తిరగదీశాడు. చూస్తే ఏముంది! ఖాళీ!!

'ఎంత ద్రోహంచేశాడు సీనయ్య! నేను వెళ్లగా చూసి, నా సొమ్ము అపహరించాడా!' అని గుండె బాదుకుంటూ ఇంటికి తిరిగివచ్చి, భార్యతో చెప్పుకుని బావురుమన్నాడు. తెలివైన లక్షలమ్మ భర్తను సముదాయించి, 'వెళ్ళి అడిగినంత మాత్రాన మనకు సొమ్ము వస్తుందా? పోనీ, నలుగురు పెద్దమనుష్యులతోటీ చెప్పి రాబట్టుకుందామంటే సాక్ష్యమా, సంపన్నమా? ఐనా నాకు ఒక చక్కటి



ఉపాయం తోస్తోంది. మీకు నచ్చితే అలాగ చెయ్యండి' అని, ఏదో రహస్యం భర్త చెవిలో చెప్పింది.

ధనయ్య, వెంటనే బయల్దేరి సీనయ్య యింటికి చేరుకున్నాడు. అతగాడి మొఖంలో ఎక్కడా సొమ్ము పోయిన విచారమే కనపట్టంలేదు. అతణ్ణి చూసిన సీనయ్య, తను చేసిన పని ధనయ్యకు తెలియదనే అనుకున్నాడు. ధనయ్య బాతాఖానీ ప్రారంభించి, 'యాత్రకు బయల్దేరిన ముహూర్తం నాకు చాలా మంచిదైంది సీనయ్య. 'అందరూ యాత్రకువెళ్లి ఇంటివద్దనుంచి పట్టుకువెళ్లినది శాస్త్రా





'తప్పకుండా వెళ్ళిరావలసిందే!' అన్నాడు సీనయ్య.

ధనయ్య కంఠస్వరం తగ్గించి రహస్యంగా, 'సీనయ్యా, నేను రామేశ్వరం వెళ్లేలోపుగా మనం ఓమాటు ఆ మఱ్ఱి దగ్గిరకి వెళ్లి రావాలోయ్. ఏమంటే కాశీ నుంచి తెచ్చుకున్న వెయ్యి వరహాలూ కూడా అక్కడ దాచిపోదామని ఉంది' అన్నాడు. మఱ్ఱిమాటరావటంతోనే సీనయ్య కొంచెం తెల్లబోయాడు గాని ధనయ్య అది గుర్తించనట్లే నటించి ఇంటికి వచ్చేశాడు.

ఖర్చుపెట్టుకొస్తారు. అలాగా కాకుండా నేను కాశీలో వ్యాపారంపెట్టి, కాస్తా కూస్తాకాదు, వెయ్యి వరహాలదాకా ఆర్జించుకొచ్చాను' అన్నాడు ధనయ్య.

సీనయ్యా, బంగారమ్మా కూడా 'ధనయ్య అదృష్టం ఏమి ఆదృష్టం?' అని అసూయకొద్దీ చప్పరించారు. ధనయ్య మళ్లీ అందుకుని "'కాశీవిశ్వేశ్వరుడు వెయ్యి వరహాలిప్పించాడు. రామేశ్వరంలో పరమేశ్వరుడు ఎంత ఇప్పిస్తాడో? ఆ యాత్రకూడా చేసివద్దాం' అంటోంది మా యిల్లాలు. నాలుగురోజుల్లో బయల్దేరి రామేశ్వరంకూడా వెళ్ళొస్తానయ్యా" అన్నాడు.

ధనయ్య వెళ్లిపోవటంతోనే సీనయ్యకి అధైర్యం పట్టుకుంది. ధనయ్యతో చెట్టుదగ్గిరకు వెళ్లినప్పుడు అతడు 'పాతరలో సొమ్ము ఏమైంది?' అని అడిగితే ఏమనటం? ఈ ప్రశ్నకు జవాబు ఏమీ తోచక మనసులో ఎంతగానో బాధపడుతున్నాడు, సీనయ్య. కాని, బంగారమ్మకి ఈ యావే లేదు. ఆవిడ దృష్టి అంతా ధనయ్య కాశీ నుంచి తెచ్చానన్న వెయ్యి వరహాలమీదనే పడింది. ఈ వెయ్యి వరహాలూ దక్కించుకుంటే ఈమాటు రవ్వలదుద్దులు, కెంపుల వడ్డాణం, పచ్చల పతకాలు—ఒకటేమిటి, సమస్తమూ చేయించుకు పెట్టుకుని,





పట్టపురాణీని మించి ఉండవచ్చునని ఉరకలువేసింది. ఆమె ఆత్రంతో సీనయ్యను విధీ విరామం లేకుండా 'ఏమండీ, మఱ్ఱిచెట్టు దగ్గిరకి అతను ఎప్పుడు రమ్మన్నాడూ?' అని అడుగజొచ్చింది.

'ఎప్పుడైతేనేం? నేను మాత్రం వెళ్ళదలుచుకోలేదు. అతడు సొమ్ము కనపడక ఇదౌతోంటే అతనికి నేనేం నచ్చజెప్పేది?' అనేశాడు సీనయ్య.

బంగారమ్మ అదోకలాగున నవ్వి, "ఇంతేనండీ, మీ తెలివి! ఈ రాత్రే మీ రొక్కరూ వెళ్ళి నూరు వరహాలూ ఆగోతిలో పాతిపెట్టి రండి. ఏమీ ఎరగనట్లు రేపు రాత్రి ధనయ్యతో వెళ్ళి, ఆ వెయ్యి వరహాలూ పాతిపెట్టించి రండి. ధనయ్యకి, గోతిలో నూరు వరహాలూ కనపడ్డంతోనే ఏ అనుమానం కలగదు. ఆ వెయ్యి వరహాలూకూడా అక్కడ పాతిపెట్టి అతగాడు రామేశ్వరం పోవటంతోనే మొత్తంగా పదకొండు వందల వరహాలూ మనం తెచ్చేసుకోవచ్చు!" అని చెప్పింది.

'ఐతే మనకి నుంచున్నపాటున నూరు వరహా లెక్కణ్ణుంచి వస్తాయి?' అని అన్నాడు సీనయ్య.

'ఎక్కణ్ణుంచేమిటండీ? అప్పు తేవాలి. నా పుట్టింటివాళ్ళు పెట్టినవీ, మీరు చేయించినవీ, ధనయ్య నూరు వరహాలతో నేను చేయించుకున్నవీ, అన్నీ కలిపి మారువాడీ దగ్గిర తాకట్టుపెట్టి నూరు వరహాలు తీసుకురండి. ఎంతసేపూ? ధనయ్య రామేశ్వరం వెళ్ళటంతోనే, పదకొండు వందల వరహాలూ తెచ్చుకుని వాటిల్లోంచి అప్పు తీర్చేసి నగలు విడిపించుకోవచ్చు' అంటూ సలహా చెప్పింది, బంగారమ్మ.

ఒక్క క్షణంకూడా సీనయ్య అలస్యం చెయ్యలేదు. బంగారమ్మ వంటిమీద నగలన్నీ వొలిచి తన చేతిలో పెట్టడం

తోనే అతగాడు దాన్ని మారువాడీవద్ద తాకట్టుపెట్టి నూరు వరహాలూ పుచ్చుకుని, ఆదారినే వెళ్ళి మఱ్ఱిక్రింద గోతిలో పాతి పెట్టి చక్కావచ్చాడు. మర్నాడు ఉదయమే ధనయ్య యింటికి పనిగట్టుకు వెళ్ళి, 'మఱ్ఱిదగ్గరికి ఈ రాత్రే వెడదాం' అన్నాడు. ధనయ్య, 'అలాగే, రాత్రి పది గంటలకు మీయింటికొస్తాను. సిద్ధంగా ఉండు' మని చెప్పి పంపేశాడు.

సీనయ్య ధనయ్యకోసం రాత్రి కనిపెట్టు కూర్చున్నాడు. పదిగంటలైంది. పదకొండు కొట్టింది; పన్నెండుకూడా దాటింది. ధనయ్య జాడలేదు. సీనయ్య 'ఏం చెప్మా రాలేదు?' అనుకొని, సంగతి కనుక్కోడానికని ధనయ్య యింటికి అర్ధరాత్రి వేళ బయల్దేరి వెళ్ళి గుఱ్ఱుపట్టి నిద్రపోతున్న ధనయ్యను లేపాడు.

'అయ్యో పాపం, దీనికోసం నిద్ర మానుకొచ్చావా? రేపు పొద్దున్నే వచ్చి చెప్పుదాం అనుకున్నాను. ఏంలేదూ. మేం రామేశ్వర ప్రయాణం మానేశాం. సాయం కాలం అలా షికారుకెళ్ళి తిరిగి వచ్చేసరికి రాత్రి అయింది. మఱ్ఱిచెట్టుపక్కనించి వస్తూ, ఆ నూఱువరహాల మాటా జ్ఞాపకంవచ్చి, వాటికోసం మళ్ళీ ఇంకోమాటు వచ్చేదేమిటని, అప్పుడే తవ్వి తెచ్చేశాను. ఆనాడు మనం పాతినవి పాతినట్లు, నూరువరహాలూ చెక్కు చెదరకుండా ఉన్నాయి సుమా సీనూ. వెళ్ళి పడుకో పాపం. రెండు ఝాములు కావస్తూంది" అంటూ, లోపలకుపోయి తలుపు వేసుకున్నాడు.

చేసేదేముంది! సీనయ్య తేలుకుట్టిన దొంగలా లోలోపల ఏడుస్తో ఇంటికొచ్చి, బంగారమ్మకి చెప్పగానే ఆవిడ గొల్లుమంది. కొత్తనీరొచ్చి పాతనీటిని కొట్టుకుపోయిందన్నట్లు అన్యాయంగా పరాయి సొమ్ముకి ఆశపడితే ఆవిడకు ఉన్న నగలు కూడా ఊడిచిపెట్టుకు పోయినై!



## లేడికి లేని కొమ్ములు దుప్పికి వున్నయ్



## ఎందుకో తెలుసా?

CHITRA

సూర్యుడూ చంద్రుడూ అన్నాదమ్ములు. అన్న నిప్పురవ్వలాటి వాడు. తమ్ముడు అమృతపు ముద్ద. సూర్యుని భార్య ఛాయా దేవి చల్లని స్వభావంకలది. చంద్రుని భార్య రోహిణి మహ తీక్షణమైనది.

అన్నాతమ్ము లిద్దరూ పరమేశ్వరునికి రెండు కన్నులలాగా వుండి ముల్లోకాల పాప పుణ్యాలు పరికిస్తూ వుండేవారు. పగల్లా సూర్యుడి వంతు రాత్రి చంద్రుడి వంతుగా రోజని రెండు భాగాలు చేసుకొని తూర్పు కొండనుండి పడమటి కొండ వరకూ యెవరి పన్నెండు గంటలు వాళ్లు ప్రయాణం చేస్తూ వుండేవారు.

సూర్యుడు తన యేడు గుర్రాల రథం మీద కూర్చుని హాయిగా వేళ తప్పకుండా ప్రయాణం చేసేవాడు. చంద్రుడు కాలి నడకని ప్రయాణం చేయడంచేత సరీగా సమయానికే బయలుదేరినా త్రోవలోనే తెల్లవారేది పాపం! నెలకు యేవక్క రోజో అతని ప్రయాణం సజావుగా సాగేది. మరిది ప్రయాణం చూడగా ఛాయాదేవికి నవ్వులాటగా వుండేది. ఈ అవమానానికి రోహిణి హృదయం భగ్గుమన్నది.

రోహిణి తన యిష్టదేవత అయిన సరస్వతిని ప్రసన్నం చేసికొని, యిదివరకు సృష్టిలో లేనిదీ అందమైనదీ వాయువేగంగా పరుగెత్తేది తన భర్తకు వాహనంగా ప్రసాదించమని కోరుకుంది. తథాస్తు అనిచెప్పి సరస్వతీదేవి అంతర్ధానం అయింది.

భక్తురాలి కోరిక నెరవేర్చడానికని సరస్వతి తన భర్తయిన బ్రహ్మకు తెలియకుండా సృష్టికార్యాలయంలోపలికి వెళ్ళి నలుమూలలా చూసింది. యెటుచూసినా తయారైనవి, సగం తయారైనవి, అప్పుడే మొదలుపెట్టినవీ రకరకాలుగా వున్నయ్. అన్నిట్లోకి వక్క శిల్పం ఆమెను బాగా

ఈ నెల బహుమతి పొందిన కథ — బొడ్డు ఉమేశ బాబు, ఏలూరు

* బహుమతిగా నవంబరు '50 నుంచి అక్టోబరు '51 వరకు 'చందమామ' పంపబడుతున్నది.

ఆకర్షించింది. బంగారంవంటి రంగు. మరకత మణులు తాపినట్లు మచ్చలు. ముచ్చటయిన ముఖం. కన్నె పడుచుకు వలే కాటుక కళ్లూ సన్నని కాళ్లూ అదీ చక్కగావుంది. దానికి ప్రాణప్రతిష్ఠ చేసి సరస్వతీదేవి రోహిణికి అనుగ్రహించింది. రోహిణి దానిని అపురూపంగా అలంకరించి భర్తకు బహుమతీ చేసింది. నాటినుంచి చంద్రుడు దానికి 'హరిణం' అని పేరు పెట్టి ఆ లేడిని తనకు వాహనంగా చేసుకున్నాడు.

కొత్తగా అమరిన ఈ వాహనం ధర్మమా అని చంద్రుని ప్రయాణం చక్కగాసాగుతూ వుంటే. ప్రపంచానికి పర్వంగావుంది. కాని ఛాయాదేవికి కళ్లెర్రపడ్డాయి. తన భర్తకు గల యేడు గుర్రాలకన్నా కూడా ఆ విచిత్ర మృగం మహావేగంగా పరుగెత్తుతూ వుండె. ఇది ఆమెకు సహింపరాని విషయమైంది. తన భర్తనుకూడా అటువంటిది ఒకదాన్ని సంపాదించమని ఛాయ చెవి నిల్లుకట్టుకుని పోరింది. భార్య పోరు పడలేక సూర్యుడు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి చంద్రుడి కిచ్చిన వాహనం వంటిది తనకొకటి అనుగ్రహించ మన్నాడు. బ్రహ్మ మొదట తెల్లపోయి, తరవాత దివ్యదృష్టివల్ల సర్వం తెలుసుకున్నాడు. సరస్వతి చేసిన పనికి చాలా కోపం వచ్చి, 'యీ రోజునుంచి సరస్వతి నాశ్రయించిన వాళ్ళు దరిద్రులై పోదురు గాక!' అని శాపంపెట్టాడు.

నెమ్మదిమీద బ్రహ్మ మళ్లీ ఆ మొదటి బొమ్మను చేసి అనుకున్న ప్రకారంగా దానికి చిలవలు పలవలుగా చక్కని కొమ్ములు తీర్చి దిద్దాడు. వంటిమీద వికారంగా వున్న ఆ మచ్చల్ని తుడిచి మొదటి దానికన్నా ఎక్కువ జవం యిచ్చి జీవం పోశాడు. అందుకనే లేడికిలేని కొమ్ములు దుప్పికి వచ్చినయ్. లేడి సరస్వతి సృష్టి. దుప్పి బ్రహ్మ సృష్టిన్ని.



# చందమామ బొమ్మల పజిలు





# పిల్లల పెంపకం

తల్లులకు మాత్రము

## పితృ భక్తి

తల్లిని మనం ఎందుకు పూజించాలో క్రిందటిసారి తెలుసుకున్నాము. తల్లి తరువాత గౌరవించవలసింది మనల్ని పోషించి రక్షించేటటువంటి తండ్రిని. వివేకవంతుడైన తండ్రి బిడ్డలను ఎంతో ప్రేమతో చూస్తూ, మంచిపనులు చేయడానికి ఎల్లప్పుడూ ప్రోత్సహిస్తూనే వుంటాడు. తండ్రి బిడ్డలకు చెప్పే ప్రతి పలుకులోనూ ప్రతి పనిలోనూ ఒకవిధమైన మంత్రబలముంటుంది. ఆయన బిడ్డల పోషణ విషయంలో ఎంతో శ్రద్ధ, భక్తి చూపుతాడు. 'నా బిడ్డలు నన్ను మించినవాళ్ళు కావాలె. నా కుటుంబపు పేరూ, కులగౌరవమూ నిలబెట్టేవాళ్ళుగా ఉండాలె,' అని అనుకొంటూ, వంశమర్యాదకోసం తాపత్రయపడుతూ వుంటాడు.

తండ్రి సంకల్పించే ఇటువంటి మహత్తరమైన వుద్దేశాలే బిడ్డలకు శ్రీరామరక్షలుగా వుండి, జీవితంలో వాళ్ళ సమస్త సౌఖ్యాలకూ ఆవశ్యకమవుతై. తండ్రి ఇచ్చే మంచి శిక్షణవల్ల బిడ్డలు తమకు తెలియకుండానే గొప్పవాళ్ళుగా తయారవుతారు.

నిరాధారులై చిన్న శిశువుగా ఉన్నప్పటినించీ తండ్రిచూపే అనురాగంవల్ల, జాగ్రత్తవల్ల, బిడ్డలు పెరిగి పెద్దలై, ఎంతెంతవారో అవుతారు. కనుక, కంటికి రెప్పగా కాచి, ప్రోచినటువంటి తండ్రిపట్ల బిడ్డలు ఎంత భక్తితో వుండాలి? ఇంత చేసిన తండ్రికి బిడ్డలు ఋణపడి వున్నారన్నమాట. ఐతే, ఆ ఋణం తీర్చుకొనడమెట్లా?—తండ్రి మనసు నొవ్వకుండా ప్రవర్తించటం ఇందుకు ముఖ్యం. కృతజ్ఞతతో ఆయనను ఎల్లప్పుడూ సేవించుకోవటం మరిఒక విధి. పితృభక్తి అనేది మానవునికి ఉత్తమ గుణాలలో ఒకటి. కాబట్టి, ఎంత కష్టపడైనా, తండ్రి కోరికలు తీర్చటం బిడ్డలవిధి.

'మీ పెద్దమ్మ'

## కంటిని నమ్మకు!




పైనవున్న బొమ్మ చూడు. ఇందులో 1, 2 అనే గీతా, 2, 3 అనే గీతా వున్నై. ఈ రెండింటిలో ఏగీత ఎక్కువ పొడగో కొలిచి చూడకుండా కనుక్కోవాలి.

జవాబుకి 55-వ పేజీ చూడు

---

## వినోద చదరం

ఈ క్రింది ఆధారముల సహాయంతో ప్రక్కనున్న చదరం పూర్తి చెయ్యండి. సరీగా పూర్తిఅయినప్పుడు, పైనుంచి క్రిందకు అయిమూలగా చదివితే ఈ నెలలో వచ్చే ఒక ముఖ్యమైనపండగ పేరు వస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | | | | |
| 2 | | | | |
| 3 | | | | |
| 4 | | | | |

ఆధారములు :

1. మొహము
2. కత్తి
3. మృదుత్వము
4. వసారా

సరియైన జవాబుకి 55-వ పేజీ చూడండి




## కోటుమీద గులాబిపువ్వు రప్పించటం

ఈ ట్రిక్కు యింతవరకు నేర్చుకొన్న వాటన్నిటికంటె చాల తేలికైనది. నీవు ప్రేక్షకులయెదుట నిలబడి వున్నావనుకో "ఇదుగో, ఈ కోటు కాలరుపైకి గులాబి పువ్వు ఒకటి రప్పిస్తాను" చూడండి అంటూవుండగానే ఒక గులాబి పువ్వు కోటుపైన కాజా వున్నచోట వచ్చి కనబడుతుంది. ఇదిఎలాగో చెబుతావిను :

సిల్కుతోగానీ, సెల్యూలాయిడ్‌తోగానీ తయారు చేసిన గులాబి పువ్వులు బజారులో అమ్ముతై. అలాటి పువ్వు ఒకటి కొను. ఇంద్రజాలికులు వుపయోగించే నల్లని 'మాయదారం' కూడా సంపాదించాలి. దారానికి ఒక చివరని ఈ పువ్వు కట్టు. తర్వాత సభకి వచ్చేటప్పుడు నువ్వు నల్లని కోటు తొడుక్కురావాలి.

పువ్వు కట్టివున్నవైపు దారం కొసని కోటు పైజేబులో వదులు. రెండవకొస కాలరు కాజాలోంచి దూర్చి కోటుపైకి రానివ్వు. ఈరెండవచివర నీ బొటనవ్రేలు పట్టేపాటి వుచ్చువెయ్యి. ఇదంతా ఎలా వుండాలో బొమ్మలో వుంది, చూడు.

సభకి ఈవిధంగా తయారై రావాలన్న మాట. అలా వచ్చినతర్వాత ప్రేక్షకుల ఎదట నిలబడి "చూడండి, నా కోటు కాలరుపైన ఏమీ లేదు కదా?" అని ప్రశ్న వెయ్యి.

ప్రేక్షకులు పరీక్షగా చూస్తారు కాని వారికి ఏమీ కనిపించదు. కోటూ, దారం రెండూ నల్లని రంగువే కనుక దారంకూడా కనుపించదు. అందుచేత వారు "లేదు, లేదు!" అంటారు.

తర్వాత నువ్వు—"బాగా పరీక్ష చేసుకున్నారుకదా మీరు? రెప్పవాల్చక చూస్తూవుండండి" అంటూ నీ బొటకెన వ్రేలికి దూర్చివున్న దారాన్ని నేర్పుతో

టపీమనిలాగు. జేబులోవున్న గులాబిపువ్వు గభీమని కాలరుపైకి వచ్చి నిలుస్తుంది. ఇదివరకులేని ఈ పువ్వు ఇప్పుడెక్కడి నుంచి వచ్చిందా అని అంతా ఆశ్చర్య పోతారు—

ఈ ట్రిక్కు చేసేటప్పుడు జాగ్రత్తగా వుండవలసినదల్లా దారాన్ని లాగేటప్పుడే. నీవు దేనినో లాగుతున్నట్టు ప్రేక్షకులకు



అనుమానం ఎంతమాత్రం కలగకుండా చాకచక్యంతో దారాన్ని లాగాలి. అంతే.

[పాఠకులు, ఈ గారడినిగురించి సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

## మఱదళ్ళు దీపావళి

రచన: కనుపర్తి వరలక్ష్మమ్మ

వస్తాడోయ్ మాబావ
దీపావళికి వస్తాడోయ్
పట్నంనుంచీ వస్తాడోయ్
బాణాసంచా తెస్తాడోయ్
సీమటపాకీల్ - చిచ్చుబుడ్లు
వెన్నముద్దలూ - విష్ణుచక్రమూ
పాముమందులూ - తీగమతాబులు
అవ్వాయి చువ్వలు - ఔటు ఫిరంగులు
రంగు మతాబులు - బంగరు తీగలు
తాటి టపాకులు - తారాజువ్వలు
చిన్ని తోటాలు - చిచింద్రీలూ!
కప్పగంతులూ - కాకర పువ్వులు
స్వతంత్ర భారతిలో -
మన - స్వతంత్ర భారతిలో
సంతోషంబున
అక్కా బావా - అన్నా నేనూ
తళ తళ కాంతులు - తావులు నిండగ
పెళ పెళ ధ్వనులూ - పిక్కటిల్లగా
కాలుస్తామోయ్ - పేలుస్తామోయ్
వస్తాడోయ్ మాబావ
దీపావళికీ వస్తాడోయ్
పట్నంనుంచీ వస్తాడోయ్
బాణాసంచా తెస్తాడోయ్.

# అట్టమీది బొమ్మ

రాజ్యంలోని రాక్షసవీరులందరూ కృష్ణ, బలరాముల చేతులలో చచ్చారుకదా! వాళ్ళు పోతే పోయిరి. మహాయోధులైనటువంటి మల్లయుద్ధ ప్రవీణులుకూడా వాళ్ళచేత చిత్తు చేయబడేసరికల్లా కంసుని క్రోధాగ్నికి మితిలేక పోయింది. అందులోనూ కృష్ణ బలరాముల దిగ్విజయానికి తన ప్రజలే తన కళ్ళఎదుట జేజేలు కొట్టట చూచి, ఆ పరాభవాన్ని కంసుడు ఎంతమాత్రమూ సహించలేక పోయాడు.

మల్లయుద్ధం చూడటానికని వచ్చిన లక్షలాది ప్రజపై అతను మండిపడ్డాడు. అగ్గి కురిపించాడు. దిగ్గున సింహాసనంనుండి లేచి, "మూర్ఖులారా!—ఎందు కళ్లా పళ్లిగిలిస్తారు? ఆ కుర్ర వెధవల్ని చూచి ఏమిటా మెచ్చుకోవటం, మీ మొహం? ఉండండి, మీ తెగులకుస్తాను' అంటూ వెర్రెత్తినవానిలాగా రంకెలు వేస్తూ, భటులతో "చూస్తారేం, ఆ రెండు పిశాచాలనూ మన నగరు అవతలికి తరిమి వేయండి. వాళ్ళ చేష్టలను మెచ్చుకొనే వాళ్లనందరినీ చావకొట్టి చెవులు మూయండి. వాళ్ళ కొంపలు నాశనంచేయండి. అన్నట్టు— ముందుపోయి, ఆ నందుణ్ణి వాళ్ళనూ బంధించరండి..." అంటూ ఇలాగ వాగజొచ్చాడు.

ఇక ఈ పిచ్చివాణ్ణి ఇలా వదిలితే లోకానికే ప్రమాదమని తలిచాడు, అవతారమూర్తి అయిన శ్రీకృష్ణుడు. క్షణమాత్రంలో ఒక్క మెరుపులా మెరిసి, సింహాసనం అధిష్ఠించివున్న కంసమహారాజు తలపై కిరీటం ఎగురగొట్టి, జుట్టుపట్టి కిందికంటా లాగి ఒక్క తన్ను తన్నాడు. దెబ్బతో 'అమ్మా!' అనే పిలుపు లేకుండా కంసుడు గిర గిర తిరిగి దొర్లుకొంటూ వచ్చి, నేలపై పడ్డాడు. పడటతోనే కంసునిలోనుండి ఒక చిత్రమైన వెలుగు వచ్చి కృష్ణపరమాత్మునిలో ఐక్యమై పోయింది. ఈవిధంగా లోకకంటకుడైన కంసుడు పూర్వకాలమందు పొందిన వరమును అనుసరించి దేవునితో దెబ్బలాడి స్వర్గలోకానికి పోగలిగాడు. రాక్షసరాజు మరణించగానే దేవతలు పుష్పవృష్టి కురిపించారు.

49-వ పేజీలోని
బొమ్మల పజిలుకు జవాబు:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 మె | రు | 2 పు | | 3 అ | శ్వ | 4 ము |
| క | | లు | | జ | | క్యం |
| 5 ము | సు | గు | | 6 ము | క్కో | టి |
| | | | | | | |
| 7 శా | ర | 8 ద | | 9 ఉ | ష్ట్ర | 10 ము |
| రి | | ళ | | డు | | రా |
| 11 క | ల్వ | ము | | 12 త | లా | రి |

51-వ పేజీలోని 'కంటిని నమ్మకు'
అనే బొమ్మకు జవాబు:
1-2, 2 3 రెండూ సమానమే!

51-వ పేజీలోని
వినోదచదరానికి జవాబు:

| | | | |
|---|---|---|---|
| దీ | నా | ర | ము |
| కృ | పా | ణ | ము |
| మా | ర్గ | వ | ము |
| పం | చ | పా | ళి |

## "ఎందుకో తెలుసా?"

●

"'లేడికిలేని కొమ్ములు దుప్పికివున్నై' ఎందుకో తెలుసా?" అన్నదానిని గురించి మాకు వచ్చిన కథలలో కెల్లా ఉత్తమంగా వున్న కథని ఈ సంచికలో ప్రచురించాం. ఈ రచన పంపించినది చి॥ బొడ్డు ఉమేశబాబు, ఏలూరు. బహుమతిగా యితనికి ఒక సంవత్సరం వరకు చందమామ పంపబడుతున్నది.



వచ్చేనెల (డిసెంబరు)కు
"పెద్దపులికి చారలు వుంటే
చిరుతపులికి చుక్కలున్నై"
ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీకు తెలిసిన ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. 'పులిచారల'ను గురించిన కథను 1948 డిశంబరులో చందమామ ప్రకటించే వున్నది. కనుక ఇప్పుడు చిరుతపులి చుక్కలను గురించిన కథ మాత్రమే మీరు రాయవలసింది. రెండు పేజీలకు మించకుండా, నవంబరు 15-వ తేదీలోగా అందేటట్టు మీరచనలు ఈ దిగువ అడ్రసుకు పంపండి.

"కథల తాతయ్య"
చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు 1686, మదరాసు-1




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (డిసెంబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras-1.



Chandamama, November '50 — Photo by A. L. Syed

గంగిరెద్దు

CHANDAMAMA (Telugu) NOV. 1950 Regd. No. M. 4854




ముచ్చటైన మత్స్యాలు